౪ కుసుమము

# వైదిక సంప్రదాయము

రచయిత

కామరాజు హనుమంతరావు



ప్రాక్ప్రతీచీ గ్రంథమాల

రాజమహేంద్రవరము

27-9-60

కామరాజు హనుమంతరావు
సంపాదకుడు & ప్రకాశకుడు

ప్రథమ ముద్రణము
శార్వరి అశ్వయుజ శుద్ధసప్తమి
రాజమహేంద్రవరము
'సరస్వతీ పవర్ ప్రెస్' నందు ముద్రితము

వెల:
ఒక రూపాయి

# పీఠిక

హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్,
తత్ త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.
పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య
వ్యూహ రశ్మీన్ సమూహ,
తేజో యత్ తే రూపం కల్యాణతమం
తత్ తే పశ్యామి యో ఽసావసౌ పురుషః సోఽహమస్మి.

(ఓ సూర్యుడా! బంగరుపళ్ళెరము నీ సత్యస్వరూపమును కప్పి వేయుచున్నది. సత్యారాధకుడ నగు నేను దానిని దర్శించుటకై ఆ పళ్ళెరమును తొలగింపుము. ప్రజాపతిసంభూతుడవు, అఖండస్వరూపుడవు సర్వాశయుడవు అగు ఓ భాస్కరుడా! నీ కిరణముల ముడుచుకొని నీలోఁ జేర్చుకొనుము. శుభప్రదమైన నీ రూపము నీ యనుగ్రహమున గాంతును. ఆ పరమపురుషుడను నేనే.)

వైదికఋషులు ద్రష్టలు. వారు స్వయముగ దర్శించిన సత్యమునే సర్వజనశ్రేయమునకై ఎంతయో యాతురతతో ప్రకటించి యుండిరి. వారేగాక ప్రత్యక్ష సత్యానుభూతి పొందిన మతకర్త లెల్లరు సత్యమునుగూర్చి అటులే యావేశపూరిత ప్రకటనలు గావించిరి. పూర్వమెప్పుడో ఏ మహనీయులో అటుల మహాసందేశము లొసంగుటయె గాక అన్ని కాలములలోను అవసరమైనప్పుడెల్ల మహాత్ము లుద్భవిల్లుచు అజ్ఞానావృతములైన మానవాళి హృదయములందు జ్ఞానజ్యోతి వెలిగింతురు.

శీతోష్ణస్థితులనుబట్టి, నదీవనపర్వతాది ప్రకృతిదృశ్యములనుబట్టి, ఒక్కొక్క దేశజనులు ఒక్కొక్క మనస్తత్త్వము బడయుదురు. అక్కారణమున ప్రపంచమున భిన్నజాతు

లేర్పడినవి. ఆ వివిధజాతుల జనులు ప్రత్యేక శరీరాకృతులే గాక ప్రత్యేక మనో లక్షణములు కూడ బడసిరి. ఆ విభిన్న మానసిక స్వభావములు విభిన్న రూపములతో వంశపరంపరా గతముగ వికాస మొంది విభిన్న జాతీయ సంప్రదాయము లుగ వెలసినవి. వాటిలో వైదికసంప్రదాయ మొకటి.

అతి ప్రాచీన కాలమునుండి భారతవర్షమున తెంపులేని ఏకైకధారగా ప్రవహించుచు భిన్నమతముల సమన్వయపరచి అంతర్గతము చేసికొని యావద్దేశమున ధార్మిక సమైక్యత గూర్చుచున్న వైదికసంప్రదాయము జగత్ప్రసిద్ధి గాంచినది. అది ఆర్ష బ్రాహ్మణ హిందూ సంప్రదాయములను భిన్న నామములతో వేర్వేరు కాలములందు ఖ్యాతి గాంచుచు వచ్చెను; కాని దాని మూల ప్రాతిపదికలు వైదికఋషి సత్తములు ఏనాడో స్వానుభూతితో వెల్లడించిన మంత్రములే.

అంతటి మహత్తర వైదికసంప్రదాయముపట్ల భారతీయులు ముఖ్యముగ శ్రద్ధజూపుట యావశ్యకము గదా? అందులకు హెచ్చరిక నొసంగుటే యీ పొత్తముయొక్క యాశయము. ఇందలి ప్రకరణములు "ధర్మజ్యోతి" మాసపత్రికలో ప్రచురింపబడిన వ్యాసములు. అవే కొలది మార్పులతో ఈ పుస్తకమున సంకలితపరచితిని. ఇందలి మహోన్నత భావములు వ్యక్తపరచుటలో నా యసామర్థ్యము గావించిన లోపములన్నియు పాఠకమహాశయులు ఆదరపూర్వకముగ మన్నింతురని విశ్వసించుచున్నాను.

కా॥ హ॥

# వి ష య ము లు

# వైదిక సంప్రదాయము

## 1. ఆరుణి ఋషి బోధ

'అయ్యో! కుమారునకు 12 సంవత్సరముల ప్రాయము వచ్చినది. నాకు పుట్టిన వీడు బ్రహ్మజ్ఞానశూన్యుడై 'బ్రహ్మబంధు' నామమున పిలువబడుచు తిరస్కృతుడగునేమో గదా! బ్రాహ్మణుని పుత్రుడైనంతమాత్రాన వీనికి కలుగునది గౌరవము గాక లాఘవమె. వీనికంటె నల్పవయస్కులు బ్రహ్మవిద్య నభ్యసించుచు గణుతి కెక్కుచున్నారు. వీని నిక వెంటనె వైదికవిద్యాలయమునకు బంపెదను' అని దేవర్షి ఉద్దాలక ఆరుణి కడు విచారముతో కృతనిశ్చయు డయ్యెను. అబ్బాలుడు శ్వేతకేతు అచటికి పంపబడెను. 12 వత్సరములు వేదమభ్యసించి 24వ యేట ఇంటికి తిరిగివచ్చెను. గడించిన జ్ఞానముతో కొమరుడు మహాగర్వియై డంబముగ చరించుట తండ్రి గాంచెను. బ్రహ్మజ్ఞాన మెట్లు గర్వకారణ మగునని తలపోసి ఆతని పరీక్షించుటకై "వినబడనిది వినుటకు, చూడ జాలనిది చూచుటకు, తెలియ నలవికానిది తెలిసికొనుటకు" నేర్చితివా యని ప్రశ్నించెను. శ్వేతకేతు విస్మితుడై 'లేదు! అట్టి విద్య అసలు ఉండ గలదా! నిజముగా నుండినచో, దాని నభ్యసింప నెంతయో కుతూహలపడు చున్నాను.' అని బదులు చెప్పెను. అప్పుడు ఆరుణి శ్వేతకేతుని బ్రహ్మజ్ఞు జేయుటకై పూనెను; ఆత్మోద్దీపకము లైన దృష్టాంతములతో ప్రబోధ నారంభించెను.

"నేను చెప్పునది చక్కగా విని చింతన చేయుము. మట్టిముద్ద ఘటాది బహురూపములు దాల్చును; అనేక నామములు పడయును. ఆ వివిధ నామరూపములు ఒక్క మట్టిముద్దనుండి నిష్పన్నములైన విభిన్నవికారముల సూచించునవె. ఇట్లే బంగారము, ఇనుము నగలుగను ఉపకరణములుగను పరిణమిల్లి నానారూపములుగ గోచరించుచు భిన్నభిన్న నామములతో పిలువబడును. అనేకము ఏకమునుండి వెడలుచుండుట గమనించుము. ఇక ఈ పరివర్తనీయ బాహ్యజగత్తు యావత్తు నీవు చూచునప్పుడు మాత్రము నీకు దృశ్యము; నీవు కళ్ళు మూసికొన్నప్పుడు గాని నిద్రలో నున్నప్పుడు గాని నీకు ఆ సర్వము అదృశ్యము. కావున విషయజ్ఞానము 'నిన్ను' అనగా ఆత్మజ్ఞానమును ఆశ్రయించుకొని యున్నదని గ్రహింపుము. నీవు చూచు ప్రతిపర్యాయము, తత్పూర్వము నీకు కాన్పించిన విషయములె కాన్పించుచు నీచేత గుర్తింపబడుచున్నవి. నీకీ విషయసంస్మృతి యెట్లు సంభవమో యోచింపవలయును. నీవు జాగరిల్లి యున్నప్పుడు, ఉండనప్పుడు కూడ నీకును వైషయికజగత్తున కంతకును అంతర్యామియై నిత్యజాగ్రదావస్థయందున్న పరమాత్మకు సర్వవిషయములు నిత్యజ్ఞేయము లైయున్నవి. అందువల్లనె నీ స్మృతిపథములోనికి విస్మృతవిషయములు మరలమరల వచ్చుట సంభవమగుచున్నది. పరమాత్మకు మరొక పేరు బ్రహ్మము. విషయజ్ఞానము ఇంద్రియములద్వారా కల్గును. బ్రహ్మజ్ఞానము ఇంద్రి

యాతీతమగు 'నీ' యంతరమందె ద్యోతకము, ప్రత్యక్షము అగును. బ్రహ్మము నీతో మిళితము, ఐక్యము అయి స్వయం ప్రకాశముగ వెలుగుచున్నది. 'తత్త్వమసి'— నీవుబ్రహ్మమె. బ్రహ్మము చూడబడదు, వినబడదు, తెలియబడదు. కాని స్వతస్సిద్ధముగా నీకు గ్రాహ్యమగును. జిజ్ఞాస చేయుము. సువ్యక్త మగును." ఇట్టి బోధనలచే ఆరుణి తన కుమారునికి సుశిక్షణ నిచ్చి బ్రహ్మజ్ఞానము గలిగించి సంతృప్తుడయ్యెను.

"ఏకమ్ ఏవ అద్వితీయమ్" అయిన బ్రహ్మము నెరిగి యున్నత జీవితము గలవాడె బ్రాహ్మణుడని, బ్రహ్మజ్ఞానము పొందక బ్రాహ్మణునకు పుట్టినవాడు "బ్రహ్మబంధు" వను అగస్త్యభ్రాతవంటి నికృష్టనామమున పిలువబడు వాడని ఆరుణీ శ్వేతకేతుల వేదగాథవల్ల సువిదితము. వేదఋషులు తమ సంతానమును ఆదర్శధర్మ చరితుల జేయుట కత్యంత శ్రద్ధ వహించిరి; హిమాలయశిఖరములందు జనించి ప్రవహించు ప్రవిత్రనిత్యవాహిని జాహ్నవివలె, ఏకధార్మిక జీవనస్రవంతిగా, తమ బ్రహ్మజ్ఞానము బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ సంస్కృతు లతో విస్మృతి జెందక నిరంతరాయముగ భారతభూమియందు ప్రవహించునట్లు జేసిరి. యావద్దేశమును వారట్లు మహాధర్మ క్షేత్రము గావించి రని ఘంటాపథముగ జెప్పవచ్చును. దేశ మధోగతి జెందిన కాలములందు సయితము ఏకొలది మహా త్ములహృదయసీమలందైన తెంపులేక బ్రహ్మజ్ఞానము జలజల పారుచునె యుండెను. నేలపై నెంత గట్టిగా కొట్టబడిన నంత

యుద్వేగముతో పైకెగయు బంతివూడిక్కి, అప్పుడప్పుడు క్రింది కెంతటి శక్తితో నణచబడినను నంతటి శక్తితో వైదిక సంప్రదాయము భరతవర్షమున తిరిగితిరిగి విజృంభించుచునె వచ్చెను.

భారతీయజనబాహుళ్యము విదేశీయ పరిపాలనలచేతను ఆచారదాస్యముచేతను ఉజ్వలధర్మజీవనము గోల్పోయి పలుమారు విషయవ్యామోహములందు, మూఢవిశ్వాసములందు నిమగ్నమగుట, మిగత కొలదిమంది మేధావులు పూర్వసస్మృతి ఆ యంధజనాళికి మరల మరల కలిగించుట, భారతమాతను దాస్యశృంఖలనుండి విముక్తను జేయుట చరిత్రప్రసిద్ధము. ఈ నవయుగమందు కూడ నట్లె జరిగెను గదా! ఆగ్లేయులు దేశమాక్రమించిరి. జనుల నైకమత్యము చెడగొట్టిరి. పరిశ్రమల చంపిరి. తెలివితేటల నణచిరి. ఐశ్వర్య మంతయు హరించిరి. బానిసజీవితము పాదుకొల్పిరి. కాని ఏమయినది? భారతీయ నవ ప్రవక్తలు రామమోహన దయానంద రామకృష్ణ వివేకానంద అరవింద రవీంద్రాదులు ఒకరితరువాత నొకరుగా ప్రభవిల్లి తమ దివ్య సందేశములు స్వదేశమందే గాక విదేశములకు గూడ గొంపోయి ప్రపంచమంతకు జాటిరి. భారతిప్రతిభను సర్వదేశ విజ్ఞానులు గుర్తించిరి. భారతీయులు ఆత్మగౌరవము బడసిరి. నవీనభారత నిర్మాతలలో నిటీవలివారైన గాంధిమహాత్ముడు, నేతాజిసుభాష్ మహాద్భుతశక్తి మానవునియందు

గర్భితమైయున్నదని నోటితో చాటుటే గాక తమ నిర్భయ కార్యములద్వారా, వీరమరణముల ద్వారా ప్రత్యక్షముజేసి కూడ జూపిరి. ఆ ధర్మాత్ముల హృదయములనుండి యుబికిన ధర్మజీవనము దశదిశల విస్తరించెను. ఏర్పడిన నూత్న విప్లవ పరిస్థితులందు ఆంగ్లపరిపాలకులు భారతదేశము, విడువ తమ కిచ్ఛ లేకున్నను, విడిచి పోవలసిన వారైరి. వారు భారతీయులతో యుద్ధమునకు దిగకుండ ) లగిరని సంతోషించుట కవకాశము లేకుండ జేసిరి. అట్టి సమరము కంటె ప్రమాదకరమైన అంతర్యుద్ధము భారతీయ హిందూమహమ్మదీయుల మధ్య రవ్వుల్గొల్పి వెళ్ళుట జరిగెను. అది వారి సంకీర్ణస్వభావమునకు ప్రబలనిదర్శనము. దేశాంతర్భాగమై పాకిస్థాన్ పేరిట నేడు విడివడియున్న ప్రాంతమున వారికి దొరికినపట్టు సడలిపోవు దినములు త్వరలోనే రానున్నవని మన మాశింపవచ్చును. స్వార్థపూరితజాతీయతకు ప్రపంచమం దెక్కడను ఇకముందు తావు లేదు. సహకారసహిత విశ్వజనీనతయే సర్వత్ర వెలయ గలదు.

ఆంగ్లేయులను గురించి యిట్లు వ్రాయుట వారిమీద ద్వేషము పురిగొల్పుటకు గాదు. మానవస్వభావము తెలుపుటకే యని గ్రహింతురు గాక! వారె గాక సర్వమానవులు సాధారణముగ స్వార్థచింత యింతో అంతో కలవారే; హింసాపరులే. గాంధిమహాత్మునివలె ఆతని యనుచరులలోనె యెంతమంది స్వార్థత్యాగులు, అహింసా ధర్మ

సాధకులు కాగలిగిరో యోచింపుడు. అహింసా ధర్మమును 'పాలసి' (సమయోచితధర్మము) గా మాత్రమె బహు సంఖ్యాకులు స్వీకరించి కానరాని ధనకాంక్షచేతనో, అధికార వ్యామోహముచేతనో ప్రేరేపింపబడినవారె. వారి నిజ స్వభావము దేశస్వాతంత్ర్యానంతరము అంతకంతకు స్పష్ట పడుచున్నది. ఆ విషయము తరచుట యనావశ్యకము గాంధి రెండవపక్షముగా నవలంబింప దగునని నుడివిన క్షాత్రధర్మ మునె వారు అధికారములోనికి వచ్చినప్పటినుండియు బాహాట ముగ పాటించుచున్నారు; "నేషనల్ కాడెట్ కోర్' 'టెరి టోరియల్ ఆర్మి' సంస్థలద్వారా ప్రోత్సహించుచున్నారు. "అహింసా పరమోధర్మః" అనెడి గాంధి ప్రకటించిన వేద కాలపు మహామంత్రమందు విశ్వాసము గలిగి దాని నాచరింప సమర్థు లగుటకై పండిత జవహరాల్ మొదలైన పరిపాలక ప్రముఖులుకొందరు వాంఛించుచున్నారు. అహింసాధర్మసాధన, కేవలాత్మశక్తిపై నెంతగా నాధారపడ గలిగిన నంతగా మాత్రమె, ఎవరికైన శక్యమగును; కాని ఎదుర్కొనవలసిన క్రౌర్యము నెదుర్కొని ఆత్మరక్షణ చేసికొనుటయే ఎల్లరికి కర్త వ్యము. అందులకు చాలినంత యాత్మశక్తి లేనివారికి క్షాత్రమె శరణ్యము. ఇట్టి స్థితిలోనె సామాన్యమానవు లందరు ఉందురని గమనించి మనము మెలగుట యావశ్యకము. భారతీయులు అహింసా ధర్మమునే గాక క్షాత్రధర్మము కూడ అనుసరింపవలసి యుండును. నేడు ఆచార్య వినోబా అహింసాధర్మము బోధిం

చుచు శాంతిసేవక సేనను ఒక ప్రక్కను, గురూజి గోల్వాల్కర్ క్షాత్రధర్మము ప్రచారము చేయుచు స్వయంసేవక సేనను మరొక ప్రక్కను మన దేశమున సమకూర్చుచున్నారు. ఈ ధర్మశిక్షకు లిరువురు భారతవైదిక సంప్రదాయ మనుసరించు వారు. వీరి శిక్షణమూలమున భారతీయులలో ఐచ్ఛికముగ స్వదేశము రక్షించుకొనుశక్తి పెంపొందును గాక !

---

# వైదిక సంప్రదాయము

## 2. యాజ్ఞవల్క్య ఋషి బోధ

వేదకాలమున బ్రహ్మవిద్య గరపుటకు గురుకులములు లవనియు, అందు నేర్చుకొనబడిన విద్య అసంపూర్తిగ న్నచో దానిని పరిపూర్తి నొందింపగల స్థితిలో గృహము ండెననియు గత ప్రకరణమందు తెలుపబడెను. బ్రహ్మచర్యము, ార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము అను చతురాశ్రమ ులద్వారా బ్రహ్మసాధనను క్రమోన్నతి గావించు విధా ముకు పునాదులు వైదిక ఋషిసత్తములే వేసియుండిరి. గురు ులము, గృహము, ప్రథమ ద్వితీయ శ్రేణిసాధనలకు క్షేత్ర ములై యుండ, స్వదేశము, సర్వవిశ్వము తృతీయ చతుర్థశ్రేణి సాధనలకు వినియోగపడెను. అందులకు తోడ్పడుచు నాటి రాజులు సాధనగోష్ఠులు జరుపుచుండిరి.

వేదఋషి యాజ్ఞవల్క్యుడు మరొక ప్రసిద్ధ బ్రహ్మ నిష్ఠుడు. అతనికి నిరువురు భార్యలు. వారిలో కాత్యాయని యను నామె గృహకృత్యముల నిర్వర్తించుచు ఆతని యైహిక సుఖజీవనమునకు తోడ్పడుచుండెను. మైత్రేయి యను నామె ఆతనికి సహసాధకురాలై ఆధ్యాత్మిక జీవన మందు సాయపడుచుండెను. గృహము శరీరసుఖానుభవమునకే గాక బ్రహ్మానందానుభూతికి కూడ వినియుక్తమైన సాధన

క్షేత్రముగ యాజ్ఞవల్క్యుడు జేసికొనెను. కేవల లౌకిక జీవులుగ కొందరు, విశేష బ్రహ్మజిజ్ఞాసువులుగ కొందరు మానవులలో స్వభావసిద్ధముగ నుందురు. అట్టి యధిక భిన్న స్వభావులగు స్త్రీపురుషులు వివాహమాడుట తటస్థించినచో, వారి జీవితము సంఘర్షణతో గూడి దుఃఖమయమై దుర్భర మగును. అననుకూల దాంపత్య దుష్ఫలముల నివారించు ప్రయత్నము సాధకులపట్ల మిక్కిలి యావశ్యకము. అంగవైకల్యముచే గాని అనారోగ్యముచే గాని భార్యాభర్తలలో నొకరు సంయోగజీవనమున కనర్హులైనయెడల, రెండవవారు ద్వితీయవివాహము జేసికొను నాచారము సాధారణముగ నను సరింపబడుచున్నది గదా! అట్టితరి దంపతులలో స్వభావములు భేదించి యొకరు ధర్మవిముఖులై యున్నప్పుడు, ధర్మపరాయణులైన రెండవవారు వేదకాలమున నిరాక్షేపణగా ద్వితీయవివాహ మాడుచుండిరేమో. ఐచ్ఛికముగనో లేక అప్పటి సాంఘిక పద్ధతినిబట్టియో యాజ్ఞవల్క్యుడు రెండు వివాహములు జేసికొనెను. ఆతడు తనకు భిన్నరీతుల తోడ్పడుచున్న యిరువురు భార్యలను తనతోడనె యుంచుకొని యాదరించుచు తుదకు గృహజీవనము విడుచునప్పుడు ఇద్దరికిని తన యాస్తిపంచుట కిచ్ఛగించెను. ఆత డట్లు గృహము ధర్మసాధనకై వినియోగించెను.

యాజ్ఞవల్క్యుడు సాధనక్రమమున అతిసహజముగ మరొక నిష్ఠయు పాటింప గలిగెను. గృహస్థాశ్రమము పూర్తిగ

త్యజించి వానప్రస్థ సన్యాసములు స్వీకరింపగల యాత్మోన్నతి బడసినతోడనె ఆతడు తన భార్య లిద్దరకు పైని తెలుపబడిన రీతిని వీడ్కోలు జెప్పెను. కాని మైత్రేయి నాథుని సంబోధించి 'సమస్తైశ్వర్యములతో ప్రపంచమంతయు నాదియైనచో తన్మూలమున నేను అమరత్వము జెంద గలనా?' యని ప్రశ్నించెను 'అప్పుడు నీ జీవితము ధనవంతుని జీవితమువలెనే యుండును. ధనమువల్ల నీకు అమృతత్వము చేకూరదు.' అని ఆతడు బదులుచెప్పెను. అనంతరము మైత్రేయి 'యేనాహం నామృతాస్యామ్, కిమహం తేన కుర్యాం? అసతోమా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ'— దేనివల్ల నాకు అమృతత్వము కలుగదో దానితో నా కేమిపని? నన్ను అసత్యమునుండి సత్యమునకు, చీకటినుండి వెలుగునకు, మృత్యువునుండి అమరత్వమునకు గొనిపొండు' అని యాతని వేడుకొనెను. అత్తరి నాత డామెను తనశిష్యురాలనుగ గ్రహించి ప్రేమయొక్క యాధ్యాత్మికతత్త్వము ప్రబోధించెను. గార్హస్థ్యజీవన మతీతించిన తరువాత యాజ్ఞవల్క్యుడు మైత్రేయియొక్క ఆధ్యాత్మికతృష్ణను గాంచినవాడై ఆమెజన్మసాఫల్యమునకు తోడ్పడెను. ఆతని యా వర్తన గొప్ప ధర్మనిష్ఠయే గదా! సన్యాస మనగా బంధుమిత్రాదులను, సంఘమును విడనాడి యేకాకియై జీవించుట గాక యైహికదృష్టిని విడిచి సంఘస్థులతో ఆధ్యాత్మికసంబంధమున మెలగుటే యని యాజ్ఞవల్క్యునిజీవితమువల్ల సుబోధకము.

మైత్రేయికి ఆతడు చేసిన బోధనల సారాంశ మెద్దియో చూతము. 'పరమాత్మ సర్వముకంటె అంతరము, ప్రియతరము. పుత్రునికన్న, పత్నికన్న, విత్తముకన్న, ప్రేయములైన సకల విషయములకన్న ప్రియతరము. పరమాత్మనే ప్రియతమముగా నెంచి యుపాసింపుము. పరమాత్మ నాశనము లేనిది కాన, నిత్య ప్రేయమై సదా నీయందే, నీతోడనె యుండును. ఓ మైత్రేయీ! పరమాత్మను సర్వభూతములందు దర్శింపుము, సమస్త ధ్వనులందు గుర్తింపుము, సకలచింతనలందు గ్రహింపుము, వివిధసంప్రాప్తములందు సాక్షాత్కరింపుము.' ఈ ధర్మోపదేశ మెంత గభీరము! ఎంత పవిత్రము! ఎంత సుఖప్రదము!

జనకమహారాజు ఒక విద్వద్గోష్ఠిజరపెను. దానికి దూర ప్రాంతములగు కురుపాంచాలములనుండి కూడ పలువురు బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞానులు - అరుదెంచిరి. వారిలో అత్యున్నత బ్రాహ్మీస్థితి నే మహనీయుడు బడసెనో తెలిసికొన జనకు డుత్సుకు డయ్యెను. అట్టివానికి పారితోషకముగా నిచ్చుటకై సువర్ణాభరణములతో నలంకృతములైన సహస్రగోవులను ఒకయావరణమున నుంచెను. 'ఓ పూజనీయ బ్రాహ్మణులారా! మీ యందిరిలో అత్యున్నత బ్రాహ్మీస్థితి నందిన మహనీయుడు ఆ గోసమూహమును తన గృహమునకు గొంపోవచ్చును' అని నుడివెను. కొన్ని నిమిషములవరకు సభ నిశ్శబ్దముగ నుండి పోయెను. చివరకు యాజ్ఞవల్క్యుడు లేచి ఆ గోసమూహమును తన యింటికి తీసికొని పొమ్మని తన శిష్యులలో నొకనితో

చెప్పెను. అప్పుడు జనకుని పురోహితుడు అశ్వలుడు యాజ్ఞవల్క్యుని 'ఆర్యా! ఈ బ్రాహ్మణు లెల్లరిలో తాముమహోన్నత సిద్ధి గాంచితి మని భావించుచున్నారా?' అని ప్రశ్నించెను. యాజ్ఞవల్క్యుడు వినయవచనములతో తన యర్హతను సూచించెను. వెంటనే అచటి పండితోత్తములలో ఎనమండుగురు వైదికకర్మకాండను, రూపకల్పనను, ధర్మతత్త్వమును గురించి ప్రశ్న పరంపరను ఆతనిపై కురిపించిరి. వారిలో నొకరైన బ్రహ్మచారిణి గార్గి బాణములవంటి నిశిత ప్రశ్నలు అడిగెను. అవి యామె పాండిత్యప్రకర్షను, వాని కీయబడిన యాజ్ఞవల్క్యుని ప్రత్యుత్తరములు నిగూఢబ్రహ్మతత్త్వమును వ్యక్తపరచునవై యున్నవి. మరియు నాతడు తనకును జనకునకును జరిగినట్లు తెలిపిన ప్రశ్నోత్తరములు కూడ గలవు. ఈ సంవాదము లన్నిటిలో యాజ్ఞవల్క్యుడు తేల్చిన పర్యవసానము మాత్రము ఇచట పొందుపరుప బడును. అది సుగ్రాహ్యము చేసికొందము.

పరమాత్మ ఏకైక సత్యస్వరూపము. దానితో సంబంధము కలిగియె సర్వజీవులు, వస్తువులు వెలుగొందుచున్నవి. పరమాత్మ ద్రష్టవ్యము, శ్రోతవ్యము, మన్తవ్యము, నిధిధ్యాసితవ్యము. మనము బాహ్యములైన జీవులను వస్తువులను చూచుచు, వినుచు, నెఱుంగుచు నున్నప్పుడు పరమాత్మనే వాస్తవముగ చూచుచు, వినుచు, నెరుంగుచు నున్నాము. కాని మన కీ దివ్యానుభవము ప్రజ్ఞాన ముదయించనంతవరకు కలుగదు. మన ప్రేమలందు కూడ మనము యథార్థముగ

ప్రేమించునది పరమాత్మనే. ఈ యుత్తమప్రేమానుభూతి సయితము మన మాధ్యాత్మికోన్నతి గాంచినప్పుడే లభ్యము. జ్యోతిర్మయములగు సూర్యచంద్రనక్షత్రాదులు మన జ్ఞానము నకు కారణములుగ గన్పట్టును. అవి మన యెదుట లేనప్పుడు, మనము గాఢనిద్రయందు మునిగి యున్నప్పుడు, అవియన్నియు మన యంతరతమ ప్రజ్ఞానము నాశ్రయముగా, మూల కారణముగా గలిగి యున్నవి. ప్రజ్ఞానము సర్వాంతర్యామి, సర్వాతీతము, స్వయంజ్యోతి.' ఈ యాజ్ఞవల్క్య సిద్ధాంత సారాంశమే "జ్యోతిషామపి తజ్జ్యోతిః, తమసః పరముచ్యతే, జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృదిసర్వస్యధిష్ఠితమ్" అను భగ వద్గీతా ప్రవచనమం దిమిడియున్నది. ప్రజ్ఞానమే ఆ పరం జ్యోతి, యాజ్ఞవల్క్యుడు పేర్కొనిన స్వయంజ్యోతి. "ప్రజ్ఞానం బ్రహ్మ" – ప్రజ్ఞానమె బ్రహ్మము – అను నిర్వచనము విఖ్యాత మహావాక్యములు నాల్గింటిలో మొదటిదియై బ్రహ్మస్వరూ పము నిరూపించుచున్నది. దానిని బట్టియె "అహం బ్రహ్మాస్మి" "తత్త్వమసి" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను తక్కిన మూడు వాక్యములును నేర్పడినవి.

ఉద్దాలక ఆరుణి సిద్ధాంతీకరించిన "ఏకమ్ ఏవ అద్వి తీయమ్ బ్రహ్మ" అను మహాసత్యమును యాజ్ఞవల్క్యుడు బహుభంగుల బలపరచెను. ఈ అద్వైతభావము ప్రస్తుతిం చుచు యాజ్ఞవల్క్యుడు జగత్తులోని సమస్తవస్తువులను జీవులను "మృత్యోః రూపాణి" — మృత్యువుయొక్క రూపములు –

అని చెప్పెను. అట్టి మాటలనుబట్టి ఆతడు జగత్తు మిథ్యయని వాదించువాడని తలంపజనదు. "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యాం అన్తరం" "యః విజ్ఞానే తిష్ఠన్ విజ్ఞానాత్ అన్తరం" — బ్రహ్మము పృథివిలో నున్నను పృథివికి భిన్నము, బ్రహ్మము విజ్ఞానమం దున్నను విజ్ఞానమునకు భిన్నము — మున్నగు అనేకవచనములచే ద్వైతభావము కూడ ప్రకటించి ఆతడు జగత్తులోని జీవులు, వస్తువులు బ్రహ్మమునకు వేరుగ అస్తిత్వము కలిగియున్న వని యొప్పుకొని యున్నాడు. ఐహికవిషములు, జీవులు చిరపరివర్తనీయము లనియు, వాని రూపములు మాత్రమే నశించు ననియు ఆత డుద్దేశించె నని మనము గ్రహించుట సమంజసము. ఆతని తరువాతి వైదిక ఋషివరేణ్యులు ఏకబ్రహ్మము భేదరహితమును, భేదప్రయుక్తమును కూడ నని విపులముగ విస్పష్టముగ ప్రతిపాదించిరి. అయ్యది ముస్ముందు కనుగొందము.

ఈ వేదాంతవిచారణ యెందుకు వచ్చినదని యెవ్వరైన విసుగు జెందవచ్చును. ఈశ్వరవిశ్వాసము సర్వమతస్థులలో పండితులకే గాక పామరులకు గూడ సహజముగ గలదు. అది హేతువులచే నిరూపితము కాజాలదని పండితులే యంగీకరింతురు. కాని యావిశ్వాస మనుసరించి యెల్లరి మనుగడ నడచును. అది మన ప్రత్యక్షానుభవమున కనుగుణముగా నుంచుకొనుచు మనకంటె నెక్కువ యనుభవజ్ఞులగు ఋషులు — ద్రష్టలు — కనబరచు అనుభవముయొక్క సమగ్రలక్షణము

లతో అంతకంత కధికముగా పెంపొందించి ధర్మపథమున అధిగ మించుటవల్లనే మన జన్మలు సాఫల్య మొందును. మన దృష్టి స్పష్టతరమైనకొలది, సృష్టిలో వరుసగా భేదము, అభే దము, భేదాభేదసామరస్యము గాంతుము. భేదాభేదసామరస్య ముతో గూడిన విశ్వాసమే వ్యక్తికిని సంఘమునకును సర్వ తోముఖాభివృద్ధి సమకూర్చి భూతలమును స్వర్గధామము జేయును. ఈ విషయము రాబోవు ప్రకరమున విశదీకరింప బడును. 'విశ్వాసో ధర్మమూలం' అని యిప్పుడు మది నిడు కొందము. విశ్వాస మనగా దృష్టియె. దానిని వికసింపజేయుట యావశ్యకము.

---

# వైదిక సంప్రదాయము

## 3. ప్రజాపతి ఋషి బోధ

'పాపము, వృద్ధాప్యము, మరణము, దుఃఖము, క్షుధ, పిపాస, మున్నగునవి లేనిదియు, సత్యకామ సత్యసంకల్పములు గలదియు, అయిన ఆత్మ అన్వేషింపబడవలెను, పరిశీలింపబడవలెను. అట్టి యాత్మను తెలిసికొను జీవుడు సర్వలోకములు, సర్వకామ్యములు బడయును.' అని జీవాత్మ పరమాత్మల ప్రత్యేకత స్పష్టీకరించుచు అనేక మహోపదేశములు చేసి వేదకాలమున ప్రఖ్యాతి గాంచిన ఋషిపుంగవుడు ప్రజాపతి. ఆతని ప్రబోధనలందు, పరమాత్మ పురుషోత్తముడని, ఆ దివ్య స్వరూపుని పొందిన జీవుడు శరీరము గోల్పోయినను నాశ మొందక వ్యక్తిత్వము గలిగి యభ్యున్నతి పథమున నిరంతర యాత్ర సలుపుచుండు నని సువ్యక్తమగును. ఐక్యమైయున్నను జీవాత్మ పరమాత్మలకు నిత్యవిభిన్నత కూడ కలదని ప్రజాపతి గావించిన గొప్ప సందేశము దశదిశల వ్యాపించి దైవస్వభావులనె గాక అసురస్వభావులను కూడ నాకర్షించెను. సురలు తమలో శ్రేష్ఠుడగు ఇంద్రుని, అసురలు తమలో నధికుడగు విరోచనుని ప్రజాపతి చాటుచుండిన సందేశము పూర్తిగ నేర్చుకొని వచ్చుటకు పంపిరి. వారు వచ్చిన యుద్దేశ్యము తెలుపుటకు ముందుగా తన యాశ్రమమందు 32 సంవత్సర

ముల కాలము బ్రహ్మచర్యవ్రతులై వైరాగ్యప్రవృత్తితో జీవింపవలయు నని ప్రజాపతిచే నాదేశింపబడిరి.

వారు దీక్ష కాలము ముగించుకొన్న పిమ్మట, బ్రహ్మ తత్త్వము తెలిసికొన నేతెంచితి మని ప్రజాపతికి విన్నవించిరి. "య ఏష అక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మా ఏతత్ అమృతమ్ అభయమ్; ఏతత్ బ్రహ్మ" — కంటిలో కానబడు పురుషుడు ఆత్మస్వరూపుడు; అతడు అమృతుడు, అభయుడు, బ్రహ్మ — అని గ్రహింపు డని ప్రజాపతి నుడివెను. కంటిలోను, నీటిలోను, అద్దములోను గాన్పించు శరీర ప్రతిబింబమును బ్రహ్మగా తమకు తెలుపబడె నని ఇంద్రుడు, విరోచనుడు భావించిరి. ఆ భావనయందలి తప్పును వారె గుర్తించునట్లు చేయుటకు, అందమైన దుస్తులు, నగలు దాల్చి ఒక పళ్లెరములో నున్న నీటియందు చూడుడని ప్రజాపతి వారిని గోరెను. ఆ జలమందు వారు అలంకరింపబడిన శరీర ప్రతిబింబము దర్శించుచున్నా మని చెప్పగా, అందు ప్రత్యక్ష మగునది బ్రహ్మయని తెలుపబడెను. అలంకృత మయినట్టియు, కానట్టియు దేహములందు గల యేకైకపురుషుడు బ్రహ్మయని ప్రజాపతి తలంపు. వా రది గమనించక శరీరమె ఆత్మ యని, దానిని వస్త్రాభరణములతో సుశోభితము చేయుట కర్తవ్య మని వా రిరువురు పొరబడిరి. ఆ పొర పాటు అభిప్రాయము వారికి వినాశకరమని ప్రజాపతి యెరింగియు అది వారె సవరించుకొనవలె నని యుద్దేశించెను.

వారు తమ గృహములకు పయనమైరి. గురువు తలంచినట్లే, విరోచనుడు ఇంటికి బోయి శరీరభోగములు మరిగి ఆత్మ జ్ఞానము లేక భ్రష్టుడయ్యెను. కాని ఇంద్రుడు ఇల్లు చేరులోపల దారిలోనె నశ్వరశరీరము మరణములేని యాత్మ యెట్లగు నను సందేహమునకు లోనయ్యెను. తత్‌క్షణమె వెనుకకు మరలి గురువును సమీపించి తన మనోకలవర మంతయు వెలిబుచ్చెను. 'శరీరము ఆత్మకు అభిన్న మైనచో, శరీర మలంకృత మైనప్పుడు అలంకృత మగుచు, కన్ను కాలులేక శరీరము చూచుటకును నడచుటకును అసమర్థమైనప్పుడు అట్లె అసమర్థమగుచు, శరీరము మృతిజెందునప్పుడు మృతిజెందుచు ఆత్మ కూడ వివిధావస్థల నందుచు నశించును. ఆత్మ శాశ్వతమై నిరంతరాభివృద్ధి జెందవలె నని చెప్పితిరి గదా? అంతయు అసంగతముగా కనబడుచున్నది. ఆందోళన జెందు చున్నాను. నా సంశయము తీర్పుడు' అని ఇంద్రుడు ప్రజా పతికి నివేదించెను. 'నీ వాదన సహేతుకముగనె యున్నది. నీవు తిరిగి 32 సంవత్సరములు ఆశ్రమమున శుశ్రూష సలుపుము. పిమ్మట మరికొంత బోధ చేసెదను" అని ప్రజాపతి చెప్పెను. అట్లె అంతకాలము ఆశ్రమములో గడిపి ఇంద్రుడు శ్రద్ధాభక్తులతో గురువర్యుని ప్రబోధమునకై నిరీక్షించు చుండెను.

అత్తరి ప్రజాపతి, జనకునకు యాజ్ఞవల్క్యుడు పూర్వము తెలిపిన తత్త్వము బోధింప దొడంగెను. 'జాగృతి కంటె స్వప్నము ఆత్మతత్త్వము నధికతరముగ వ్యక్తపరచును.

నీ వది పరికింపు' మని ఇంద్రునికి జెప్పెను. ఇంద్రుడు స్వయముగా చింతనచేసికొని 'స్వప్నమందు ఆత్మ బాహ్యవిషయ ప్రేరణ లేక స్వతంత్రముగ వర్తించును. వాస్తవిక జగత్తునకు సంబధించని కాల్పనిక జగత్తు నిర్మించుకొని అందు భయభ్రాంతులకు వశమై సత్య మిదమిద్ధ మని నిరూపించుకొన జాలకుండును' అని గురుదేవునకు మనవిచేసెను. అప్పుడు ఆ యనుభవము నందు యాథార్థ్యము కలదని యొప్పుకొని 'నీ వింకను 32 సంవత్సరములు శుశ్రూష చేయుము. అటుపిమ్మట నూతనాంశము తెలిపెదను' అని ప్రజాపతి పత్యుత్తర మిచ్చెను. ఈ గడువు దాటిన తరువాత ఇంద్రుడు తనను మరల ప్రార్థింపగా, స్వప్నముకంటె సుషుప్తి విశేషరూపమున ఆత్మోపలబ్ధిని ఎరుకపరచును. నీ విప్పు డది పరీక్షింపుము' అని నియోగించెను. ఆ యన్వేషణయు గావించుకొని, గాఢనిద్రయందు భిన్న భిన్నముగా నుండు జగత్తేమాత్రము గోచరింపకుండును గాని ఆ స్థితి యేకత్వమును గాక శూన్యతనే తెలుపును' అని ఇంద్రుడు తన యనుభవము విన్నవించెను. ఆతని నిరూపణ సరియైన దని ప్రజాపతి యంగీకరించి 'యింకను 5 సంవత్సరములు ఆశ్రమవాసము చేయుము. అప్పుడు నీకు యథార్థ తత్త్వము సుబోధకము చేసెదను' అని జవాబు చెప్పెను. ఆ కాలపరిమితియు గడచినతరువాత ఈ క్రిందివిధముగా ప్రబోధించెను.

'ఓ ఇంద్రా! దేహము నిజముగా వినాశ మొందునదే. కాని అది నాశరహితమయిన ఆత్మకు ఆవాసము. శరీరముతో నున్న యాత్మ శరీర సుఖదుఃఖములకు భ్రాంతివశమున లోన గును. విదేహాత్మ శరీరావస్థల దాటును. అజ్ఞానమువల్ల జీవుడు తనను దేహముతో నైక్యపరచుకొని దాని స్థితిగతులు తనవె యని భ్రమించును. నిజమునకు జాగ్రత్స్వప్నసుషుప్తులు కూడ వ్యాధిజరామరణాదులవలె శరీరమునకు సంధించినవే. ఆ యవస్థలు ఆత్మకు లేవు. స్థూలనేత్రదృష్టి నతీతించిన సూక్ష్మవిజ్ఞాన దృష్టి- దివ్యదృష్టి - ఉదయించినతోడనే జీవాత్మ బ్రాహ్మీస్థితి నొంది, శరీర ధారియయ్యు, సర్వవిషయ పరివృతమైనను శరీరస్పృహయే లేక విషయపారవశ్యత లేక సంపూర్ణాత్మానుభూతితో మహదానందమున నోలలాడును. ఈ యుత్తమ పదవి, దేహమును విడుచుటకు ముందె, ఈ లోకమందె, ఇప్పుడె ఆత్మకు లభించవచ్చును. ఇది జీవన్ముక్తి. "స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవమే వాయమ్ అస్మిన్ శరీరే ప్రాణో యుక్తః" - గుర్రము బండికి కట్టబడి యున్నట్లుగా, జీవుడు శరీరమునకు బంధింపబడియున్నాడు. ఆత్మకు దేహముతో గల సంబంధ మిట్టిది. గుర్రపుబండియందలి గుర్రము తన వ్యక్తిత్వ ప్రత్యేకతలను గలగియున్నట్లె, దేహమం మిడియున్న ఆత్మ స్వేచ్ఛానుసారము, స్వయముగా వర్తించును. ఈ యత్యున్నతానుభూతి, సుషుప్తియందో మరణమందో చేకూరునది కాదు; సంపూర్ణజాగ్రదావసలలోనె లభింపవలసినది. ఇదియె

మానవాత్మకు లక్ష్యమైయుండవలెను. ఇందులకే నీవు ప్రయత్నింపుము. ఓ ఇంద్రా! ఇంతకంటె అధికముగా నేను చెప్పవలసిన దేమియు లేదు.' అని ప్రజాపతి చెప్పగా ఇంద్రుడు సంతృప్తుడై గృహమున కేగి తల్లక్ష్య ప్రాప్తిచే తాను తరించుటే గాక తోడివారలను తరింప జేసెను.

మనకు సాధారణముగా ఏకత్వము సంఖ్యానీకమైన ఒకటిగానె అర్థమగును. తాత్త్విక ఏకత్వమును మనము సదా చూచుచు దాని నాధారము చేసికొని వ్యవహరించుచున్నను, దానియందు దృష్టి నిలుపక పోవుటవలన, అది మనకు తెలియని దానివలె నుండును. రెండు ప్రక్కలు కలిగియు కాగితపుముక్క, మూడు వైపులు కలిగియు త్రిభుజము, అట్లె అనేక పార్శ్వములు కలిగియు బహుభుజము ఒక్కటిగా నుండుట గాంచుచున్నాము. వాటియందలి భిన్న భాగములు విడదీయరాని వనియు, అవి భేదప్రయుక్తమగు అభేదమును కనపరచునవనియు మనకు బాగుగ తెలియును. ఇట్లే యేవస్తువును గాని యేజీవిని గాని పరిశీలించినచో, అనేకాంతర్గత విభాగములతో కూడియున్నను, ఆ వస్తువు, ఆ జీవి ఏకత్వము ప్రదర్శించును. ప్రజాపతి యుద్బోధించిన యీ భేదాభేద వాదము సర్వజనులకు అనుభవవేద్య మనుటకు సందియములేదు.

ఇంద్రప్రజాపతుల సంబంధమందు నుత్తమ గురుశిష్యుల ప్రవర్తన ప్రకటిత మగుచున్నది. శిష్యుడు తీవ్రజిజ్ఞాసువై యుండవలెను. ఆచార్యునియందు సంపూర్ణ భక్తి శ్రద్ధలతో

మెలగవలెను. శిష్యుని జానకాంక్షను భక్తి శ్రద్ధలను ఎప్పటి కప్పుడు గమనించుచు వాటికి తగినట్లుగా శ్రేణీక్రమమున బోధించువాడె ఉత్తమగురువు ఇంద్రప్రజాపతులవంటి ఆదర్శ గురుశిష్యులు మనకు నేడు సామాన్యముగ కాన్పించరు. ఆధ్యాత్మిక నైతిక విద్యలు ఈరోజులలో చక్కగా గరపబడుటయే లేదని చెప్పవచ్చును. లౌకికవిద్యలు నేర్పెడు మన ప్రస్తుతవిద్యాలయములు, కళాశాలలు గురుకులవిధానముల కెంత దూరములుగా నున్నవో కరతలామలకము. దేశమంటే మట్టి గాదని, మనుష్యు లని మనము గుర్తించినాము ; పాడుకొనుచున్నాము. బిడ్డలను పెంచుటలోను యథార్థవిద్యావంతుల జేయుటలోను మన మెంత యుదాసీనులమై యుందుమో యోచించుకొనుడు. దేశీయుల సక్రమాభివృద్ధి ననుసరించే దేశాభివృద్ధి యుండు నని గమనించి యుచితరీతి పాటుపడుదము.

---

# వైదిక సంప్రదాయము

## 4. ఇంద్ర చిత్ర ఋషుల బోధ

చిరనూతనముగ చిత్రవిచిత్రరూపములతో అనంత మహిమను వ్యక్తపరచుచు ఇంద్రియగోచరములగు సమస్తచరాచర సృష్టిజాలము ఏకైక పరబ్రహ్మయందు పుట్టుచు పెరుగుచు పరిణమించుచు నున్నవని ఉద్దాలకఆరుణియు, ఆతనికంటె స్పష్టతరముగ యాజ్ఞ్యవల్క్యుడును ప్రతిపాదించుటగాంచితిమి. కాని వా రిరువురు వివిధజీవులకు, వస్తువులకు గల విభిన్నత్వము ఇహపరములందు శాశ్వతముగ నిలిచియుండునదే యని కూడ నంగీకరించినట్లు వారి ప్రవచనములవల్ల తెలియగలదు. అభేదవాదము, భేదవాదము-రెంటిని చక్కగా సమరస పరచుచు విపులముగ చర్చించి భేదాభేదవాదమును సిద్ధాంతీకరించిన వేదర్షి ప్రజాపతి యని కనుగొంటిమి. ఈ భేదాభేదసిద్ధాంతమును ప్రజాపతి శిష్యుడగు ఇంద్రుడును వేదవిజ్ఞానధనులు మరికొందరుకూడ నామోదించిరి. ఇంద్రుడు దానినిగూర్చి చేసిన వ్యాఖ్యయు తదితరులలో ముఖ్యుడగు చిత్రుడు దాని శ్రేష్టతను కన్నులకు కట్టినట్లు చేయుటకై ఆలంకారికభాష యందు అభివర్ణించిన వర్ణనలను ఇంచుక పరిశీలింతము.

నాటి యోధాగ్రేసరుడు ప్రతర్దను డనువాడు తన శక్తిసామర్థ్యముల ఫలితముగా ఇంద్రుని సమక్షమునకు పోగలిగెను. ఇంద్రు డాతని మెచ్చుకొని ఏదైన వరము కోరుకొను

మని యాదేశించెను. కాని యాతడు ఆ వరమును ఇంద్రుడే నిర్ణయించి తన కొసంగవలయు నని ప్రార్థించెను. అప్పుడు ఇంద్రుడు ఆ వర మేదో దాని విశేష మేమో యిటుల జెప్పెను: 'మానవుడు బడయగల మహావరము తా నెవడో తెలిసి కొనుటే. ప్రతివ్యక్తియందు విశ్వాత్మ గర్భితమై యున్నది. వ్యక్తి - జీవాత్మ- విశ్వాత్మతో నైక్యమై తత్పూర్ణానుభూతి నొంది పాపపుణ్యముల నతీతించి అతిపవిత్రస్వరూపు డైన ప్పుడు అవతార నామమున బరగును. 'ప్రాణము ప్రజ్ఞానము' అను ద్వివిధశక్తి స్వరూపములతో ప్రతిమానవుడు వర్తించును. ప్రపంచ విషయములతో సంబంధము కలిగి వ్యవహరించునప్పుడు ప్రాణస్వరూపుడని, పరమాత్మతో సంబంధముకలిగి తల్లక్షణముతో వెలుగునప్పుడు ప్రజ్ఞాన స్వరూపుడని మానవుడు పిలువబడును. ప్రాపంచిక విషయములకు భూతమాత్రలని, ప్రజ్ఞానస్వరూపుని శక్తులకు ప్రజ్ఞామాత్ర లని నామాంతరములు. ప్రజ్ఞామాత్రలు వినా భూతమాత్రలు గ్రాహ్యములు కావు. భూతమాత్రలు కలవను భావనయైన ప్రజ్ఞామాత్రలు లేనిచో అసంభవము. చూడబడు, వినబడు, ఇంద్రియ గోచరములగు సర్వభూత విషయములకంటె చూచునట్టి, వినునట్టి, సకలేంద్రియములను ప్రేరేపించునట్టి ప్రజ్ఞానశక్తులు ముఖ్యములు, తప్పక తెలిసికొనదగినవి. భూతమాత్రలుప్రజ్ఞామాత్రలందు, ప్రజ్ఞామాత్రలు

ప్రాణమందు అర్పితములు. భూతప్రజ్ఞామాత్రలును, వాటిని సంధానపరచు ప్రాణి- జీవాత్మ- యు అవినాభావసంబంధమున మెలగుచున్నవి. జీవాత్మయు పరమాత్మయు సమైక్యమై యున్నవి. “సః మే ఆత్మ” — పరమాత్మ నా యంతరాత్మ — అను భావము కలిగి తనను వేరుపరచుకొనుచు పరమాత్మతో నైక్యపరచుకొను సంయోగానుభవము గడించి మానవుడు జన్మ సార్థకపరచుకొనును. ఇవ్విధమున బ్రహ్మతత్త్వమును ఇంద్రుడు ప్రతర్దనునకు వివరించి దానిని బోధపరచుటకై రథచక్రము ఉపమానముగ జూపెను. చక్రపరిధి, చక్రపు నిలువుకర్రలు, చక్రనాభి పరస్పరము సంబద్ధమై యున్నటుల భూతమాత్రలు, ప్రజ్ఞామాత్రలు, ప్రాణము కలసి ఒక్కటిగా నున్నవని గ్రహింపుమని కోరెను. ఇంతగా తరచబడినను బ్రహ్మస్వరూపము మనకు సుస్పష్టముగ తెలియకపోవచ్చును. బ్రహ్మానుభూతి పొందినవారలకే అది సుగ్రాహ్యము. బ్రహ్మ సర్వాంతర్యామి; ఏవస్తువునకు, జీవికి బాహ్యమున నుండువాడు కాడు. ఆతడు సర్వాతీతుడు ; సమస్తవస్తువుల, జీవుల సముదాయము కాదు. ఆతడు ప్రతిఅణువునందు, ప్రతిప్రాణియందు అఖండ, అనంతజ్యోతిగా వెలుగొందుచు మనకు సాక్షాత్కరించును. ఆ దివ్యదర్శనము మహాద్భుతము, వర్ణనాతీతము. అయినను ఆ యనుభూతమగు పదవిని ‘బ్రహ్మలోకము’ అనుపేర, దానిని చేర్చు పథమును ‘దేవయాన

ము ’ అను పేర, చిత్రుడు గావించిన వర్ణనను సుబోధకము జేసికొన నిక యత్నింతేము.

చిత్రుని పురోహితుడు, గౌతముడు, కర్మకాండనిరతుడై బ్రహ్మజ్ఞానమునకు దూరుడై యుండ, వానికి ఆతడు దేవయానమునుగురించియు బ్రహ్మలోకమునుగురించియు రూపకల్పన జేయుచు నభివర్ణించెను. కర్మకాండ నాచరించువారు పితృయానమున పయనించి అశాశ్వతపుణ్యఫలముల నందుచు తిరిగితిరిగి జన్మలు దాల్చుచుందురని, జ్ఞానకాండ ననుసరించువారు దేవయానమున ప్రయాణముచేసి అమృతపదవి చేరుదు రని ఉపనిషత్కారులు సామాన్యముగ వెల్లడించు విషయమె. దేవయానగాముల యాత్రా స్థలములను యాత్రా గమ్యమును గురించి చిత్రుడు తెలిపిన యంశములు సుప్రసిద్ధములు, భావగర్భితములు. దేవయానపథికులను సత్యము, జ్ఞానము, అనంతము మొదలగు గుణములయొక్కయు ఆధ్యాత్మిక శక్తులయొక్కయు మూర్తులైన దేవదూతలు మార్గదర్శులై నడుపుచుండ, వారు వరుసగా అగ్ని, వాయు, ఆదిత్య, వరుణ, ఇంద్ర, ప్రజాపతిలోకములు జేరుచు అచ్చటచ్చటి దివ్యసుఖముల ననుభవించి చివరకు బ్రహ్మలోకమున ప్రవేశించి శాశ్వతానందము చూరగొందు రనియు, దేవదూతలు దారిలో వారినితల్లక్షణాభరణములతో నలంకరించి బాహ్యాంతశ్శత్రువులనుండి రక్షించి జరామరణాద్యవస్థల దాటించి సంపూర్ణాత్మానుభవ సమన్వితుల జేయగా, వారు ప్రపంచ

విషయముల మధ్య 'బ్రహ్మగంధము' చే నాకర్షింపబడుచు బ్రహ్మలోకము - 'సాలజ్యసంస్థానము' - నందు ప్రవేశించి 'బ్రహ్మరస'పానము చేయుచు 'బ్రహ్మయశో' పూరితులగుచు 'బ్రహ్మ కృపా విశేషముచే' విశ్వవిభుసభాస్థానమున 'విచక్షణ'— ప్రజ్ఞ — సింహాసనమున ఆసీను లగుచు 'అమితౌజస' - ప్రాణ - పర్యంకమున విహరించుచు నుందురనియు, "త్వమాత్మాసి, యః త్వమాసి సః అహ మస్మి" — నీవు పరమాత్మ స్వరూపుడవు; నీవు ఎట్టి స్వరూపుడవో, నేను అట్టి స్వరూపుడను - అను మహాబ్రహ్మానుభవస్ఫూర్తితో సదా వర్తింతు రనియు అనేక విచిత్రవర్ణనలతో చిత్రుడు బోధించెను. ఆతడు కనపరచిన గమ్యము పరమహంసపదవి, జాగ్రత్స్వప్న సుషుప్త్యాది సర్వావస్థలందు పరివ్యాప్తమును వాటికి అతీతమును అయిన తురీయము.

భేదాభేద బ్రహ్మవాదము ప్రతిపాదించు విషయములు బృహదారణ్యక, ఛాందోగ్య, కౌషీతకి ఉపనిషత్తులందు పుష్కలముగ గలవు, మరియు సహేతుకముగ చర్చించబడినవి. అట్టి యంశములు ఇతర ఉపనిషత్తులలో గూడ ననేకము సూత్రప్రాయముగ వెల్లడింపబడినవి. మాండూక్యోపనిషత్తు చాల చిన్నదే యైనను, ఈ వాదమును సమగ్రముగ నిరూపించి ఉపనిషత్తులలో అత్యున్నతస్థానము వహించినది. సంపూర్ణానుభవ సిద్ధమైన యీ వాదమును అస్పష్టముగ తెలుపుచు అసంపూర్ణానుభవ జనితములగు తద్భిన్న వాదము

లను వ్యక్తపరచునట్టి కొన్ని వాక్యములు ఉపనిషత్తులలో గాన్పించును. కాని యీ భేదాభేదబ్రహ్మవాదమే అత్యుత్తమము ; యుక్తియుక్తము. అదియే వ్యష్టిసమిష్టులకు అర్హప్రాముఖ్య మిచ్చి లోకకల్యాణమునకు తోడ్పడునది. అది సర్వజనామోదము బడయక ఆచరణలో లేనియెడల, మానవకోటియందు వ్యక్తినిరంకుశత్వమో, సంఘనిరంకుశత్వమో ప్రబలి సాంఘిక రాజకీయ రంగములను సంఘర్షణకు, అశాంతికి గురిచేయును.

వేదకాలపు స్వాభావికవర్ణవ్యవస్థ, శూద్రకులజుడైన చిత్రుడు గొప్పబ్రహ్మజ్ఞానియై పూజనీయ ఋషిసత్తము డగుటకును బ్రాహ్మణవర్ణస్థుడు, చిత్రుని పురోహితుడు అయిన గౌతముడు బ్రహ్మజ్ఞానశూన్యుడు కాగా చిత్రుని శుశ్రూష సలిపి బ్రహ్మవిద్యాపారంగతుడగుటకును అడ్డు రాకుండెను. జన్మవలన వంశపరంపరాగత లక్షణములు కొన్ని కలుగుచున్నను, అవి నిలుపుకొని వృద్ధిజేసికొనుటకు గాని వాటిని త్యజించి క్రొత్త జీవితము బడయుటకు గాని మానవునకు శక్తి కలదు. కావున గుణకర్మలనుబట్టి యేర్పడు వర్ణవ్యవస్థ సహజము, ఉపయోగకరము.

# వైదిక సంప్రదాయము

## 5. బ్రహ్మ సాధన

మానవజన్మ ఇతరజీవుల జన్మకన్న శ్రేష్ఠతర మను నది నిర్వివాదాంశము. ప్రాణము జడపదార్థములందు సయుతము కలదు ; కాని అవ్యక్తము. నిమ్న జీవులలోకంటె నున్నతజీవులలో, అవయవములు ఇంద్రియములు సంఖ్యయందును కౌశలమందును పెంపొందుచుండ, సహజ జ్ఞానము (Instinct) క్రమాభివృద్ధి జెందును. ఈ సహజజ్ఞానము మానవునియందు విజ్ఞానము (Intuition) గా పరిణమించును. తన్మూలమున తనను తాను తెలిసికొనుటకును, తనకును సర్వజీవులకును సమస్తవస్తువులకును అంతర్యామి యైయున్నను అతీతుడు కూడనై, భిన్నుడయ్యును అభిన్నుడుగ కూడనై వెలుగొందుచున్న సత్యస్వరూపుని గ్రహించుటకును మానవునకు సాధ్యమగును. సకలేతర ప్రాణుల సహజజ్ఞానమువలె మానవుల విజ్ఞానము స్వయంప్రకాశము మాత్రమె కాక, స్వానుభూతి విలసితము, బ్రహ్మోపలబ్ధికారకము. ఇందే మానవజన్మాధిక్యత నిజముగా గలదు. కావున మానవుడు తన జీవితము సార్థకపరచుకొనుట యెట్లు ?

విజ్ఞానము సామాన్యముగా ప్రారంభదశయందు ప్రతి కార్యమునకు కారణమారయును; కనుగొనబడిన ప్రతికారణము మరొక కారణముయొక్క కార్యమగుచుండ, అంతులేని

యన్వేషణమున తగుల్కొనును. ఇటుల కొంత యతృప్తి జెందు చున్నను, నిరంతర పరిశోధనా ఫలితముగా సృష్టివికాసక్రమము సుగ్రాహ్యము జేసికొనుచు నూతనవస్తునిర్మాణము (Invention) చేయగల శక్తి సంపాదించును. దీనివల్లనే పాశ్చాత్యులు భౌతికశాస్త్రముల (Science) లో నత్యున్నతి గాంచ గలిగిరి. అనేక జీవనసౌకర్యములు సమకూర్చుకొని నవనాగరికత యందు దినదినాభివృద్ధి గాంచుచున్నారు. వారి సంచారము భూమిని దాటి ఆకాశములోనికి వెళ్ళినది; దానిని కూడ నతిక్రమించి గ్రహనక్షత్రమండలములలోనికి పోవున ట్లున్నది. ఇంతకును వారు పొందుచున్న సృష్టివిషయకజ్ఞానము సదా అనంతముగనే కన్పట్టుచుండ, వా రెంత వృద్ధినొందినను తమ యల్పత్వమె యంగీకరింపవలసినవా రగుచున్నారు. పాశ్చాత్య విజ్ఞాన వేత్తలె విశ్వము అద్భుతము (Mysterious) అని నేడు నుడువుచున్నారు. కాన భౌతికవిద్యలు అపరావిద్య లని, "పరా యయా తదక్షర మధిగత్యతే" - దేనిచేత అక్షర బ్రహ్మము తెలియనగునో అయ్యది పరావిద్య—అని ముండకోపనిషత్తు వాక్రుచ్చుచున్నది.

మనుష్యునకు జన్మ కలిగినట్లే మరణమును ఎప్పుడో యొకప్పుడు తప్పక కలుగును. మరణము మరుక్షణమె తటస్థింప వచ్చును. అందుల కాతడు సదా ఆయత్తుడై యుండుట యావశ్యకము. ప్రపంచ భోగభాగ్య ములు వెంటరావు. బంధుమిత్రాదులు విడనాడుదురు. అట్టి నిరాశ్రయస్థితి భయంక

రము. గత్యంతర మేది యని మృత్యువాసన్న మైనప్పుడు మానవుడు తహతహలాడవలసి వచ్చును. కాబట్టి "ఇహాచేద వేదీ తథ సత్యమస్తి; న చేదిహావేదీన్ మహతీ వినష్టిః; భూతేషు భూతేషు విచిన్త్య ధీరాః, ప్రేత్యాస్మాల్లోకాద మృతా భవన్తి"—ఈ లోకములో బ్రహ్మమును తెలిసికొన్న యెడల, మానవుని జన్మ సార్థకమగును. తెలిసి కొననిచో, వానికి మహానష్టము వాటిల్లును. కావున వివేకవంతులు చరాచర సృష్టిజాలములో నన్నిటియందు బుద్ధి చొప్పించి పరిశీలించి బ్రహ్మమును కనుగొని యీ లోకమునుండి వెడలి అమరు లగుదురు — అని కేనోపనిషత్తు ఉద్ఘాటించుచున్నది. నిత్యానిత్యముల విచక్షణ చేయునంతగా మానవుని విజ్ఞానము దీప్తి నొందవలెను. శాశ్వత సత్య స్వరూపుడగు బ్రహ్మమును పొందుటకు మానవుడు సర్వకాల సర్వావస్థలందును సాధన సలుపవలెను. విజ్ఞానప్రజ్వలనకు, సాధననిష్ఠకు గురుసాన్నిధ్యము, సాధుసాంగత్యము తోడ్పడును. "ప్రాప్య వరాన్ నిబోధిత"— శ్రేష్ఠుల జేరి బ్రహ్మజ్ఞానము బడయుడు- అని కఠోపనిషత్తు ఆదేశించుచున్నది. పూర్వజన్మ సుకృతమువల్ల కొందరి కవి కేవల స్వయంకృషిద్వారా లభింపవచ్చును. పలువురపక్షమున అయ్యది వృథాకాలహరణకును దుర్భర బాధలకును ఒకప్పుడు మరణమునకును కారణ మగును. అన్నివిషయములలో వలె బ్రహ్మసాధన విషయమునను అను

భవజ్జుల సహాయమును గైకొనుట విధాయకము. వైదిక సాంప్రదాయిక బ్రహ్మసాధన యెట్టిదో యించుక విచారింతము.

వేదకాలమున పుట్టిబ్రహ్మజ్ఞాన విలసితమగు సంప్రదాయము తరతరములనుండి నేటివరకు భారతవర్షమున ప్రవహించుచునే యున్నది. అది ఆచారమాత్యముచే అప్పుడప్పుడు కలుషిత మగుచుండెను. విదేశ సంప్రదాయముల సంఘర్షణముచే కొన్ని సమయములందు కలత జెందుచుండెను, స్వదేశమందలి తన యవలంబుల స్వార్థపరత్వముచే తిరిగి తిరిగి సంకీర్ణ మగుచుండెను; కాని యీ దురవస్థలన్నియు సంఘజీవనమున దానికి సంప్రాప్తించినవే. అన్ని కాలముల యందు బ్రహ్మసాధనలలో నిమగ్నులై యున్న మహాత్ముల హృదయక్షేత్రముల నుండి యుబికి పొంగిపొరలెడు ఆధ్యాత్మిక విజ్ఞానధారలచే వైదిక సంప్రదాయము మరల మరల ప్రగతి నొందియుండెను. వైదిక సాంప్రదాయిక బ్రహ్మసాధన యనగా ఆ యుత్తమ విజ్ఞానులచే పరిపోషితమగునదే యని మనము గ్రహింపవలెను. అద్దానినే మనము సాధనానామమున ఆచరింపబడు సర్వ దుర్వృత్తులనుండి, శుష్కాడంబర కర్మలనుండి వేరుపరచి అవలంబింపవలెను.

వైదికసాధన వైదికతత్త్వానుగుణముగనే యుండవలెను గదా! జీవాత్మ పరమాత్మనుండి వేరుగా నున్నను పరమాత్మతో విడరాని సంబంధము కలిగి యైక్యతయు జెందియుండు నని వైదికఋషిసత్తముల యనుభవ మని

మనము పూర్వ ప్రకరణములందు గ్రహించితిమి. మనము ప్రత్యేకముగా లేనిచో గాని, సంబంధము కలిగి యుండనిచో గాని, మన మెద్దియైన తెలిసికొనుట, ప్రేమించుట, అనుకరించుట, ఐక్యపరచుకొనుట యసంభవము. బ్రహ్మసాధన యందు బ్రహ్మను తెలిసికొనుట, ప్రేమించుట, అనుకరించుట, ఐక్యపరచుకొనుట జీవాత్మకు సహజకృషిగా నుండును. "యతోవా ఇమానిభూతానిజాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ ప్రయన్త్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ". దేనినుండి సమస్త చేతనాచేతన భూతములు పుట్టి దేనిచేత వర్థిల్లి దేనియందు జేరి లయ మగుచున్నవో దానిని వెదకి తెలిసికొనుడు. అదియె బ్రహ్మము అను సాధనసూత్రము వరుణుడు తన కుమారుడగు భృగువునకు గావించిన మహోపదేశ మని, జిజ్ఞాసద్వారా భృగువు బ్రహ్మమును మొదట అన్నమయ స్వరూపునిగను, పిమ్మట ప్రాణమయ స్వరూపునిగను, పిమ్మట మనోమయ స్వరూపునిగను, పిమ్మట విజ్ఞానమయ స్వరూపునిగను, తుదకు ఆనందమయ స్వరూపునిగను గ్రహించినటుల తైత్తిరీయోపనిషత్తు వివరించు చున్నది. విజ్ఞానము తీక్షణమైనకొలది బ్రహ్మముయొక్క సూక్ష్మతర సూక్ష్మతమ స్వరూపములు గోచరించును. కాని "అన్నం న నింద్యాత్ తద్వ్రతమ్, ప్రాణోవా అన్నమ్" – అన్నము తృణీకరింప తగదు, అన్నమును నిందింపకుండుట వ్రతముగా జేసికొనవలెను. వాస్తవమునకు

ప్రాణమె అన్నము-అని తైత్తిరీయోపనిషత్తు నొక్కి చెప్పు చున్నది. ఆనందమునందే కాక విజ్ఞానమందు, విజ్ఞానమందే కాక మనస్సునందు, మనస్సునందె కాక అన్నమునందు మనము బ్రహ్మసాక్షాత్కారము పొందవలెను. భృగువునకు వలె సామాన్యమానవు లెల్లరకు బ్రహ్మదర్శనము ప్రప్రథమ మున అన్నము (Matter) నందు, అనగా జడపదార్థము లందు కలుగుచుండు ననియు మనము గమనింపవలయును. 'యో దేవో ఽగ్నౌ యోఽప్సు యో విశ్వం భువన మావివేశ, య ఓషధిషు యో వనస్పతిషు తస్మై దేవాయ నమో నమః.' 'అగ్నియందు, జలమందు, విశ్వమందు, ఓషధులందు, వృక్షములందు అంతర్యామియై ఏ దేవు డున్నాడో, ఆ దేవునకు అనేక వందనములు' అనెడు స్తోత్రము ఉపనిషత్తులలో చాల చోట్ల గలదు. బాలబాలికలకు లేబ్రాయమున నుపదేశింప బడు గాయత్రీ మంత్రము కూడ ఆ స్తోత్రభావముతో కూడి నదె. బిడ్డలకు, పెద్దలకు, పామరులకు, పండితులకు-ఎల్లరకు జిజ్ఞాసపూర్వక మననము బ్రహ్మసాధనయందు ముఖ్య ప్రక్రియ. తద్వారా బ్రహ్మదర్శనము సృష్టివిభూతులందు మొట్టమొదట కలిగి పిదప ప్రాణ మనో విజ్ఞాన రస స్వరూప ములందు క్రమక్రమముగా చేకూరి పూర్ణయోగము-బ్రహ్మై క్యత — సిద్ధించును. దర్శన మనగా చక్షురింద్రియముద్వారా మాత్రమే గాక సర్వేంద్రియములద్వారా పొందబడునది యని విపులార్థము చెప్పుకొనుట యావశ్యకము, సముచితము.

"ఆత్మా వా అరే ద్రష్టవ్యో శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః" అని బృహదారణ్యకోపనిషత్తు ఘంటాపదముగ నుడువుచున్నది. మనము కళ్ళతో చూచునది, చెవులతో వినునది, ఇతరేంద్రియములతో పొందునది బాహ్యావిషయములే, కాని యవి విభూతులని బ్రహ్మస్వరూపములని దర్శించుటకు విజ్ఞానము మన యింద్రియములకు తోడ్పడవలెను. అట్లు గాక విషయములను విషయములుగనె గ్రహించి వాసినే ధ్యానించు వ్యక్తి, భగవద్గీత చెప్పునట్లు, కామక్రోధాదులకు వశుడై బుద్ధిని గోల్పోయి 'ప్రణశ్యతి'-నశించును. బ్రహ్మసాధననె యోగ మని భగవద్గీత నిర్వచించును, జ్ఞాన భక్తి, కర్మ ప్రపత్తులుగా యోగమును నాలుగువిధముల విభజించి వ్యక్తీకరించును. వాటిలో ఏది ముందు ఏది తరువాత అభ్యసింపవలయు నను ప్రశ్నకు తావు లేదు. శరీరవ్యాపారములు కలిగి కర్మశీలుడుగను, హృదయప్రవృత్తులు కలిగి ప్రేమస్వభావుడుగను, బుద్ధిప్రయోగములు కలిగి జ్ఞానవిశిష్టుడుగను, ధ్యానపారవశ్యతలు కలిగి ప్రపన్నచిత్తుడుగను మానవుడు ఎల్లప్పుడు విషయములమధ్య చరించును. ఆయా వృత్తులు భౌతికవిషయములకు మాత్రమె సంబంధించి యున్నంతవరకు వాడు పశుతుల్యుడు, కాని యవి బ్రహ్మోపలబ్ధికి సాధనములైన తోడనె సాధకు డగును. అప్పటినుండి వాడు బ్రహ్మమును మననము చేయగలుగును; మానవనామ

మున కర్హుడగును; సమాధిస్థితుల బడయు శక్తివంతు డగును ; సాధనయందు సిద్ధు డగును.

"కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః" — కర్మలను (విధికృత్యములను) ఆచరించుచునే మానవుడు నూరు సంవత్సరములు అనగా యావజ్జీవితము గడుప నిచ్ఛగింప వలెను — అను ఈశోపనిషత్తునందలి నియమము పాటించి సిద్ధపురుషుడు ఈశ్వరునివలెనే సదా కర్మతత్పరుడై లోక సంగ్రహమునకే పాటుపడును.



# వైదిక సంప్రదాయము

## 6. ధర్మాచరణ

బ్రహ్మతత్త్వమును గురించి, బ్రహ్మసాధనను గురించి వైదికఋషులు తాము అనుభవపూర్వకముగ పొందిన జ్ఞానము తమ శిష్యులకు అనుభవములద్వారా గరపి బ్రహ్మచర్యమున నుత్తీర్ణుల జేసి వారిగృహములకు వారిని పంపుసమయమున వీడ్కోలుసందేశ మొసంగుట యాచారము. తైత్తిరీయోపనిషత్తునందు గల యట్టి సందేశ మొకటి యీదిగువ పొందుపరచెదను.

'సత్యము చెప్పుము. ధర్మము ఆచరింపుము. స్వాధ్యయనము విస్మరింపకుము. గురుదక్షిణల నర్పించుచుండుము. వంశపారంపర్యమునకు తెంపు రానీయకుము (వివాహము చేసికొని సంతానము బడయుము). సత్యము, ధర్మము, స్వాభివృద్ధి, సర్వశ్రేయము — వీని నుపేక్షింపకుము.

'దేవపితృ సంసేవనము మానకుము. ఉపదేశకులను తల్లిదండ్రులను దైవసములుగ పూజింపుము. అతిథులను గూడ నట్లె సన్మానింపుము. ఈ యుత్తమవిధుల నిర్వర్తించుచు తదితరముల విసర్జింపుము. మేము చేయు కార్యములలో మంచివి యాచరింపుచు తదితరముల వీడుము.

'మనకంటె శ్రేష్ఠులగు బ్రహ్మజ్ఞులను సదా గౌరవింపుము. వారియెడ నశ్రద్ధ యేమాత్రము చూపక సంపూర్ణ

శ్రద్ధ కలిగి భయభక్తులతో, వివేచనా సానుభూతులతో వారిని సత్కరించుచుండుము. ధర్మానుష్ఠానములను లౌకికవిధులను నిర్వర్తించుటలో నీకు సందేహములు కలుగునప్పుడు, కొందరు వేటినైన నిషేధములుగ తెలుపునప్పుడు, నీ యిరుగుపొరుగున నివసించు విజ్ఞానధనులు, విశుద్ధాత్ములు, భక్తితత్పరులు అగు బ్రహ్మనిష్ఠులు ఉపదేశకులుగ నియుక్తులైయున్నను కాకున్నను వారు మెలగెడు మార్గమున నీవును మెలగుము.

'ఇదే నా యాదేశము, ఉపదేశము. ఇదే వేదరహస్యము, అనుశాసనము. ఇదే నీకు కర్తవ్యము, విధ్యుక్తము.'

ఈ గురుసందేశమందు ఆచరణకు సంబంధించిన అతి ముఖ్యవిషయములు సూత్రప్రాయముగ నుడువబడినవి. తత్త్వజ్ఞానము ఎంత గడించినను, సాధననిష్ఠ ఎంత కలిగియున్నను, వాటివల్ల సహజముగ చేకూరి రూపొందవలసిన బ్రహ్మోపలబ్ధి జీవితమందు మూర్తీభవించుకొనజాలని వ్యక్తి కృపాపాత్రుడు. ఆతని కృషి శుష్కము, నిరుపయోగము, కేవలబాహ్యాడంబరము. పడిన శ్రమకు తగిన ఫలితము తప్పక యుండవలెను. అప్పుడు ఉపలబ్ధియందలి మంచిచెడ్డలు కష్టించినవానికిని తోడివారలకును పొడగట్టును. తన్మూలమున వారు చెడ్డను తొలగించి మంచిని పెంపొందించుటకు ప్రయత్నింతురు. కృషి యంతకంతకు శ్రేష్ఠత గాంచును. కావున తైత్తిరీయమునందు గురువు శిష్యునకు ఆచరణావశ్యకతనుగూర్చి చేసిన తుది

హెచ్చరిక చాల సమంజసముగా నున్నది. అందలి యంశముల నెత్తుకొని యించుక విచారింతము.

సత్యము, ధర్మము - ఈ పదములు మనము వేర్వేరు అర్థములందు వాడుచుందుము. సత్యము వచింపవలసినది యని, ధర్మము ఆచరింపవలసినదియని గదా ఆదేశింపబడెను. సత్యము పరబ్రహ్మమునకు వేద మొసంగిన ప్రధాన నామము. "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో దివ్య స్స సుపర్ణో గరుత్మాన్ । ఏకం సద్విప్రా బహుధావదన్తి అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః" సత్యము ఒక్కటే. దానిని బ్రహ్మ విదులు అనేకనామములతో ఇంద్రుడని, మిత్రుడని, వరుణు డని, అగ్నియని, దివమని, సుపర్ణుడని, మాతరిశ్వానుడని, గరుత్మంతుడని పిలుతురు - అని ఋగ్వేదమున నుడువబడినది. గాంధిమహాత్ముడు సత్యమునే భగవంతునిగ భావింపవలయు నని కోరుట యెంతయు సముచితము. సత్యము అనంతము, దాని పూర్ణరూపము దుర్గ్రాహ్యము. కావున సత్యమునకు పూర్ణ నిర్వచనము అసాధ్యము. సత్యము బుద్ధికి నందినంతవరకు ప్రతి వస్తువునందు, ప్రతిజీవియందు పరిమితముగానె గోచరించును. దాని స్వరూపము ఎప్పటికిని అపారమై మనస్సున కతీతము గనె యుండును. కనుక మనము సత్యమును జీవితాదర్శముగ నుంచుకొని సాధ్యమైనంతవరకు మాటలలో వర్ణింతుము. స్తుతింతుము. మన జీవితము నిరంతరాభివృద్ధి జెందుటకు అనంతసత్యమునె ఆదర్శముగ నిడికొనుట యావశ్యకము. ఇత

తులకు సత్యము అనంతమని చెప్పుటయు నావశ్యకము. 'సత్య మేవ జయతే' అను వాక్యమందుద్దేశింపబడిన సత్యము ఎవరి గుప్పిటలో నుండునది కాదని అందరము గ్రహింతుము గాక! 'నేదం యదిద ముపాసతే' అని ఒకరికొకరు చెప్పు కొనుచు పరస్పరసహనము కలిగి సత్యాన్వేషణమున నిమ గ్నుల మగుదుము గాక! అప్పుడు సత్యముపేరిట జరగు సమరము లన్నియు సమసిపోవును, మతసాంఘిక రాజకీయ రంగములు శాంతినిలయము లగును.

ధర్మము ఆచరింపవలసినది, జీవితమున పూర్తిగ మూర్తీభవింపవలసినది. యావజ్జగత్తు సత్యమందు పుట్టి సత్య మందు పెరిగి సత్యమందు గిట్టుచున్నది. సృష్టి స్థితి లయములకు క్రమపద్ధతి గలదు. సర్వభూతములు పరస్పర సంబంధము కలిగి నీమబద్ధములై సహకరించుకొనుచు వర్ధిల్లును, వినాశ మొందుటలో సయితము నిర్ణీతమార్గ మనుసరించును. ఇట్లు సృష్టిజాలమును సామరస్యమున కూర్చి శాసించి పాలించునది ధర్మము. సృష్టితోపాటు ధర్మము కూడ సత్యమునుండి యుద్భ విల్లునదే. సత్యము సాక్షాత్కరించుటకు పూర్వమె ధర్మము సర్వత్ర కానవగును. దేశకాలపాత్రల కనుగుణముగ భిన్న రీతుల ప్రకటిత మగును. సృష్టియందువలె ధర్మమందు కూడ వైచిత్ర్యము గోచరించును. ప్రతివస్తువునకు, ప్రతిజీవికి 'స్వభావనియత' మయిన కర్మ ప్రత్యేకప్రత్యేకముగ నుండును. మూలమున ఒక్కటిగా నున్న 'శాశ్వత ధర్మమే' ఒక్కొక

మానవునియందు ఒక్కొక 'స్వధర్మము'గా వ్యక్తమగును. ప్రతిపురుషుడు, ప్రతిస్త్రీ తన పరిస్థితులలో, తన సంబంధ బాంధవ్యములలో తన స్వభావమునుబట్టి యెటుల ప్రవర్తింప దగునో గుర్తించి ఆ ప్రవర్తనను తన ధర్మముగ స్వీకరించి యాచరింపవలయును. స్వధర్మాచరణయందు ఏమాత్రము లోపము వచ్చినను వ్యక్తి జీవితమే గాక సంఘజీవితము కూడ నష్టపడును. 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' అను గీతాసూత్రము జీవితలక్ష్యము కావలెను. సహజరీతిని వర్ణాశ్రమధర్మములు, యుగధర్మములు, దేశధర్మములు సర్వ ధర్మములు పాటింపబడవలెను. కాలిబంతియాటలో ఆట గాండ్రందరు సుశిక్షితులై తమ స్థానముల నిలచి తమ కర్తవ్యముల నిర్వర్తించునప్పుడు, ఆట జయప్రదముగ సాగును గదా? సంఘమందలి వ్యక్తుల యాచరణవిషయమునను అంతే. గృహ్య స్వదేశీయ సర్వదేశీయ సాముదాయిక జీవనము లన్నిటియందు పాల్గొనుచు సత్యము, ధర్మము ఉల్లంఘింపక వర్తించుట యెల్లరికి విధి.

'దేవపితృసంసేవనము మానకుము,' అతిథిసత్కారము సలుపుము' అనునది యా సందేశమందలి మరొక విషయము. సత్యస్వరూపుడగు భగవంతుని నెల్లరు అనుదినము ఆరాధించ వలెను. జీవితారంభమున గృహమందు తల్లిదండ్రులు, గురు కులమున ఆచార్యుడు ధర్మశిక్షకులై అభ్యుదయకారకులుగ నుందురు కావున, వారు స్వతంత్ర జీవనము గడుపునట్టి సర్వ

జనులకు దైవసములుగ సదా పూజనీయులై యుండవలెను. వారు ఆచరించిన సత్కార్యములు సమాచరణీయములై యుండవలెను. వారిలో దురభ్యాసము లేవైన నున్నచో, అవి త్యజనీయములే యని గురుకులాచార్యుడు స్పష్టముగ తెలుపు చున్నాడు. సామాన్యముగ సదభ్యాసములకంటె 'దుర భ్యాసములె సులభముగా పట్టుబడును. కనుక ఆ హెచ్చరిక అవసరమె. పరమేశ్వరుని, ధర్మ ప్రబోధకులను స్తోత్రపాఠము లతోను, బాహ్యసత్కారములతోను సేవించుచు మనము సాధారణముగ కాలక్షేపము చేయుదుము. దైవభక్తి, గురుభక్తి కార్యాచరణయందు కాన్పించవలయు నని చేయ బడిన యుపదేశము గమనించుట ముఖ్యము.

ఆ యాచార్యోపదేశమందు గ్రహింపవలసిన యింకొక ముఖ్య విషయ మున్నది. మనము వివిధజీవితరంగముల ప్రవే శించినతరువాత ఒక్కొకప్పుడు అతిక్లిష్టసమస్యలు ఎదుర్కొను చుందుము. కొందరు చేయదగునన్నది మరికొందరు చేయ కూడనిది యని చెప్పుచుందురు. స్వయముగ కర్తవ్యము నిశ్చయించుకొన జాలకుందుము. సంశయచిత్తుల మగుదుము. మన హృదయములు అంధకారమయము లై పోవును. వాదోప వాదములవల్ల ప్రయోజనము కాన్పించదు. 'సంశయాత్మావిన శ్యతి' అనుమాట తథ్యమని తోచుచుండును. అట్టి సమయ మందు అనుసరింపవలసిన మార్గము గురుకులాచార్యుడు నిర్దే శించెను. మన చుట్టుప్రక్కల వసించు ధర్మవర్తనులగు సత్పు

రుషుల యడుగుజాడల నడచుటే యట్టితరి విధాయక మని ఆతడు చెప్పెను. ధర్మాత్ములు మన దృష్టి నాకర్షింతురు. వారియెడ భక్తిశ్రద్ధల చూపుచునె యుందుము. ధర్మనిరూపణమున వారికి గల సామర్థ్యమునకు నిదర్శనము లనేకము వారి జీవితమందు ప్రత్యక్షముగ గాంచి యుండుటచే వారిని విశ్వసింతుము, అనుకరింతుము. ఇది సహజలక్షణమే. వైద్యశాస్త్ర మేమియు తెలియకున్నను, గొప్పవైద్యులెవరో తెలిసికొన గలము. న్యాయశాస్త్ర మేమియు నెరుగకున్నను, గొప్ప న్యాయవాదు లెవరో యెరుంగ గలము. మన ప్రాణవిత్తముల నిలుపుటకై మన మవి వారి హస్తమం దుంచుదుము. అట్లే మహాత్ములకు వశీభూతుల మగుదుము. దృష్టాంతము కంటె నుత్తమప్రమాణ మెద్దియు లేదు. నిదర్శనములు దొరికినతరువాత మన కితర ప్రమాణములు అనావశ్యకములు. ముఖ్యముగా ధర్మ సందేహములందు తగులొన్నప్పుడు, శిష్టులను మనము మార్గదర్శులుగ గైకొనవలెను.

సద్గురువులు, మహానాయకులు మధ్యాహ్నమార్తాండునివలె ప్రకాశించుచుందురు. ఏమాత్రము వివేకము గల వారైనను ఆ మహాశయుల గుర్తింప నేర్తురు. వీరపూజను ప్రశంసించుచు ఆంగ్లవిజ్ఞానవేత్త కార్లైలు, మహాపురుషుల సంఘటనాశక్తిని కొనియాడుచు అమెరికా భక్తాగ్రేసరుడు ఎమర్సన్, జీసస్‌యొక్క ధర్మోత్సాహమును మెచ్చుకొనుచు రష్యాసాధుపురుషుడు టాల్‌స్టాయ్ కావించిన నవయుగ ప్రబో

ధనలు ఇంగ్లండు, అమెరికా, రష్యా దేశముల యభ్యుదయము నకు చాలవరకు కారణములు. ప్రతిదేశమందు కష్టకాలము లందు అద్భుతశక్తిసంపన్ను లుదయించుచు 'ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే' అను గీతాప్రవచనము రూఢిపరచుచున్నారు. ధర్మసమ్మూఢచేతస్కుడైన అర్జునుడు 'శాధి మాం త్వాం ప్రపన్నమ్'— నీ శరణు జొచ్చితిని, నన్ను ప్రబోధింపుము.—అనుచు శ్రీకృష్ణుని ఆశ్రయించి నట్లు మనము మహాపురుషుల జేరి ప్రబోధితులము కావల యును. 'స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు'—భగవానుడు మనకు శుభదాయకమైన బుద్ధి ప్రసాదించుగాక!

---

# వైదిక సంప్రదాయము

## 7. సమరస జీవనము

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా
ఏకం రూపం బహుధా యః కరోతి।
తమాత్మస్థం యే౽నుపశ్యంతి ధీరాః
తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్.
— కఠోపనిషత్, 2 అ. 2 వ. 12 శ్లో.

'ఏవఁడు ఏకైకనియంత, సర్వాంతర్యామి అయి తన ఏకరూపము బహురూపముల నొందించుచున్నాడో, ఆతనిని తమ యంతరంగమున దర్శించు ప్రజ్ఞావంతులు అనశ్వరసుఖము బడయుదురు, అన్యులు బడయజాలరు' అని కఠోపనిషత్తు చాటుచున్నది. సృష్టిలోని ప్రతి రూపమందు నిండి సర్వము పరిపాలించుచు పరబ్రహ్మ బాహ్యజగత్తున కలడు. అచట మనము ఆతనిని హేతుజ్ఞానము ద్వారా అఖండ స్వరూపునిగ తెలిసికొని స్తుతింపవచ్చును, ఇతరులకు ప్రకటింపవచ్చును, కాని ఆ సత్యస్వరూపుని మన హృదయాంతరమున దర్శింపక పోవచ్చును. ఏలయన, మన దృష్టి సామాన్యముగ వెలుపలికి ప్రసరించుచు ప్రాపంచిక విషయములనే గాంచును, వాటిని గూర్చి తర్కించును, స్థూలముగ ఏకత్వమును కనిపెట్టును. కాని ఆ నిరూపణ అనుమానాస్పదమె, శాశ్వతసుఖము నీయ జాలదు. బాహ్యజగత్తుకంటె విస్మయకరమైన మహాజగత్తు

మన యంతరమున కలదు. అంతర్ముఖుల మైతిమేని, అది పొడగట్టును. మన కది యతిసన్నిహితము; భిన్నమయినది కాదు. ఆత్మపరీక్ష చేసికొన్నకొలది, సర్వేశ్వరుని యేకైక సత్యస్వరూపమును అధికతరముగ సాక్షాత్కరింప గలము. ఆతనియందు సర్వరూపములు, సకల విభేదములు సామరస్య మందుటను, బాహ్యాంతరములు రెండును ఐక్యమగుటను ప్రత్య క్షముగ దర్శింతుము. ఆ సర్వసామరస్యముయొక్క స్వాను భూతి ప్రశాంతి ప్రదము, మహదానంద దాయకము.

మన హృదయాంతరాళమున అనేక సంక్షోభములు చెలరేగును. ఒక యోచనను మరొక యోచన, ఒక భావనను ఇంకొక భావన, ఒక సంకల్పనను వేరొక సంకల్పన డీకొని సమరము సాగించును. ఆ పోరాటములందు మనము తగు లొక్కొందుము. హృదయాందోళన తీవ్రమగుచు మన జీవిత ముల దుఃఖమయము చేయును. ఇక మనకు సుఖ మెట్లు సాధ్యము? భిన్నాభిప్రాయములకు, విరుద్ధప్రేమలకు, వివిధ కార్యోత్సాహములకు సామరస్యము జూపునట్టి యీశ్వరదర్శ నము చేతనే సుఖము సిద్ధించును. ఆంతరిక సామరస్యము బాహ్యసామరస్యములకు దారితీయును. బాహ్యమున సయి తము శాంతివాతావరణము ఏర్పడగలదు. కాన మనము ముఖ్యముగ ఏకాంత ధ్యానము అలవరచు కొనవలెను. తత్సా ధనయందు సూక్ష్మదృష్టిని పెంపొందించుకొనుచు ఆంతరిక సమస్యలను ప్రథమున పరిష్కరించుకొందము. ఆ సమన్వయ

బుద్ధితో పిదప సాంసారిక సాంఘిక రాజకీయాది సకలబాహ్య సమస్యలను సులభముగ పరిష్కరించుకొన గలము. సంపూర్ణ ధర్మజీవనము బడయ గలము. ధర్మానుష్ఠాన మనగా నలు గురితో పాటు మనము సామాన్యముగ గావించు మతకర్మ కాండ గాని లౌకిక కార్యకలాపము గాని కాదు. ధర్మజీవనము బ్రహ్మదర్శన ధ్యాన ధారణాదుల మహా ఫలితము. యథార్థ ధర్మసాధకుడు సర్వదా సర్వత్ర సామరస్యము నెలకొల్పుటకే పాటుపడును. వైదిక ఋషులు వ్యక్తియందు, గృహమందు, సంఘమందు, రాజ్యాంగమందు, ప్రపంచమం దెల్లెడల సమర సజీవనము నెలకొల్పుటకై ఏ విధానము లనుసరించిరో తెలిసి కొందము. ముందుగా వ్యక్తిగత జీవనమును వారెట్లు సమ న్వయించుకొనిరో యించుక పరిశీలింతము.

తమలోపల సంగ్రామము లేనేలేదని, అద్దానికి సంబం ధించిన విచారణ తమ కక్కరలేదని కొందరు చెప్పుదురు. వారు నిజమునె చెప్పుచున్నారు. వారు మూఢాచారపరులై యుందురు, లేక ఇంద్రియ పరవశులై యుందురు. వివేకము వారిలో పనిచేయుచుండదు. వారు మూఢాత్ములు, జడులని చెప్పవచ్చును; తమ కలవడినది విడువ నేరరు. విషయలోలు రను ఉన్మత్తులుగ పరిగణింపవచ్చును. ఆ యిరుతెగలవారు నిత్యవికాసము గాంచవలసిన వివేకమునకు దూరులై; సంఘాభి వృద్ధికి విరోధులై. కాని మహాత్ములుదయించుటతోడనె ధర్మ తేజము వెలువడి నలుగడల ప్రసరించి మాధ్యమును పటా

పంచలు చేయును, విషయవాసనల దగ్ధము చేయును. కావున మహాపురుషుల యవతరణ సంఘోద్ధరణకు అత్యంతావశ్యకము గదా? వ్యక్తిగత సాధనయందు ఉత్తీర్ణులైనవారె ఆ యాదర్శపురుషులు. దీనినిబట్టి కూడ వ్యక్తిగతసాధనయొక్క ప్రాముఖ్యము వెల్లడియగుచున్నది. అగ్నివలె ధర్మము హృదయమునుండి హృదయమునకు స్పర్శమాత్రమున విస్తరించును.

అనంతసత్యము హృదయ సింహాసనమున నధిష్ఠింపజేయుటకు జరుపవలసిన సమరము అనంతముగ నుండకతప్పదు. కావున మన ప్రయత్నము ఆంతరికయుద్ధము లేకుండజేయ కానేరదు. అయ్యది ఘోరయుద్ధమందు సయితము శాంతి బడయు విధాన మారయుటే. మనలోపలి అరిషడ్వర్గములో అసలుకామమె ప్రధానమైనది. దానినుండి, తక్కిన క్రోధాదులు అయిదు, ఒకటి తరువాత నొకటిగా జనించును. కామమును గూర్చియె ముఖ్యముగ పరిశీలింపవలసి యున్నది. అది తన బంటులతో కలసి మన యింద్రియముల కుత్తేజనము కలిగించును, అపారశక్తి నొసంగును. ఇంద్రియములు కామక్రోధాదులయొక్క ప్రబలమూర్తులై అజేయములుగ నుండును. వాటిని రూపుమాపుట యసంభవము. అవి ధర్మబద్ధములగుచో, మోక్షసాధనములై హృదయసీమయందు, బాహ్య ప్రపంచమందు ఈశ్వర రాజ్యము స్థాపించుటకు తోడ్పడును. ధర్మముచే పాలింపబడుచు మోక్షఫలము నిచ్చెడు అంతశ్శత్రు

వుల సేనాధిపతియగు కామము పురుషార్థములలో నొకటిగ పేర్కొనబడుచున్నది.

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు, బుద్ధిన్తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ"— "ఇంద్రియాణి హాయనా హురివిషయాంస్తేషు గోచరాన్, ఆత్మేంద్రియ,మనో యుక్తం భోక్తేత్యాహుః మనీషిణం" — అని కఠోపనిషత్తు నుడువుచున్నది. 'నీయాత్మ రథాధిష్ఠాత, నీశరీరము రథము, నీబుద్ధి సారథి, నీమనస్సు, కళ్ళెము, అని తెలిసికొనుము. నీ ఇంద్రియములు గుఱ్ఱములు, నీవు పొందు విషయములు మోక్షమార్గములు, వివేకప్రయుక్తమగు మనస్సు గల నీవు స్వర్గసౌఖ్య మనుభవించు భోక్తవు, అని తత్త్వజ్ఞులు వచింతురు-ఈ ప్రవచనములతో మానవునకు కఠోపనిషత్తు చేయు హెచ్చరిక గమనింపుడు. కాన కామక్రోధాదులను ధర్మప్రయుక్తములుగ సంస్కరించుకొనుటే మనకు కర్తవ్యము. వేదాంతసారమైన భగవద్గీత "మయి సర్వాణి కర్మాణి సన్యస్యాధ్యాత్మ చేతసా, నిరాశీ నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః"— పరమాత్మతో నేకీభూతమైన మనస్సుతో, శరీరవాంఛలు వీడి కర్తృత్వము త్యజించి స్వార్థశూన్యుడవై నీ సర్వకార్యములు బ్రహ్మార్పణము గావించి యుద్ధము సలుపుము — అని యుద్బోధించుచున్నది. "కర్మసుకౌశలం యోగమ్" అనియు, "సమత్వం యోగ ఉచ్యతే" అనియు చెప్పుచు కర్మకుశలత్వము, సమత్వము ఇవి రెండును యోగమున సమన్వయించునని భగవద్గీత తెలుపుచున్నది.

బీజమందు యావద్వృక్షము కానరాకుండ నిమిడి యుండును. తగిన పరిస్థితులు, పోషణ, రక్షణ అమరినచో విత్తనము మొలకెత్తి గొప్పమ్రాను అగును. మానవుని విషయమునను జరుగునది అంతే. శిశువులో ఎట్టిశక్తులు దాగి యున్నవో తెలియదు. అర్హమైన సాంగత్యము, ప్రబోధము, శిక్షణము లభించినయెడల, బిడ్డడు పెరిగి మహాత్ముడు కాగలడు. మానవులకు అభిరుచులు, సామర్థ్యములు వేర్వేరుగా నుండును. వాటికి ఆవశ్యకమయిన ప్రత్యేక దోహదములతో వాటిని పోషించి పెంపొందించు బాధ్యత బిడ్డల తల్లిదండ్రులు, సంరక్షకులు, అధ్యాపకులు నిర్వహింపవలెను. గృహ విద్యాలయ పద్ధతులు ఎంత సక్రమముగా నుండిన, అంత చక్కగా బాలబాలికలు పెరిగి యుత్తమ గృహస్థులుగను, పౌరులుగను, పరోపకారులుగను పరిణమింతురు. అభినివేశములనుబట్టి, విద్య ప్రారంభ మగుటతోడనె, బిడ్డలను తరగతులుగ విభజింపవలసి యుండును. కొందరు సత్వగుణము, కొందరు రజోగుణము, కొందరు తమోగుణము ప్రధానముగ కలిగియుందురు. మొదట తరగతివారికి మానసిక విద్యలు, రెండవ తరగతివారికి రాజసికవిద్యలు, మూడవతరగతివారికి ఆర్థికవిద్యలు సామాన్య విద్యతోపాటు ప్రత్యేకముగ గరపబడవలెను. అధ్యాత్మిక విద్య అన్ని తరగతులవారికి ముఖ్యముగ నీయబడవలెను. అప్పుడు మూడు తరగతులవారు తమ ప్రత్యేక విద్యలందే గాక బ్రహ్మవిద్య యందును విజయోపేతులై ద్విజులని పిలువబడుటకు అర్హు లగుదురు. నేడు బ్రాహ్మణులని, క్షత్రియు

లని, వైశ్యులని పరిగణింపబడువారిలో యథార్థమైన ద్విజులు ఏకొలది మందైన ఉన్నారో లేరో! వారు కేవలము జన్మను బట్టి ఆ నామములు ధరించుచున్నారు. జన్మవలన ఎవరికైన లభించుచునది శూద్రత్వమే (శుశ్రూష జీవనమే). ఈ జీవనము కలవారు నాల్గవ తరగతికి జెందినవారె అయినను అగ్ర వర్ణనామముల దాల్చి వర్ణవ్యస్థను హాస్యాస్పదము చేయుచున్నారు. ఇక్కాలమున సయితము భారతవర్షమందే గాక సర్వదేశములందును నాలుగు సహజ వర్ణములవారు ప్రబలులై సర్వమానవ క్షేమమునకు పాటుపడుట యావశ్యకము. సంఘమందు ఎవరు ఏ యపరావిద్యయందు నిపుణులైనను ఎల్లరు పరావిద్యయందు కూడ నభ్యున్నతి గాంచినప్పుడు మాత్రమే సహకారజీవనము చేకూరి సర్వజనులు సురక్షితముగా నుందురు. ధర్మబుద్ధి కలవారు తగినంతమంది ప్రస్తుతము లోకములో లేని కారణముననే, సర్వవినాశకరమగు ప్రపంచయుద్ధము మరల ఏ క్షణమున ప్రారంభ మగునో యన్న భయముతో ప్రతి దేశమువారు తల్లడిల్లుచున్నారు. ఇప్పటికిని, ఎప్పటికిని స్వాభావసిద్ధమగు వర్ణవ్యవస్థ లోకశ్రేయమునకు ఆవశ్యకమె.

మహానదులు పర్వతశిఖరములనుండి నిర్మలోదకముల బడయును, స్రోవపొడుగునను సముద్రమున కలియు పర్యంతము ప్రాంతీయ ప్రదేశములకు తమ జలముల ప్రసాదించి వాటిని ఫలపుష్ప భరితములగు వృక్షలతాదులతో శోభిల్ల జేయుచున్నవి. అట్లే సృష్టియందు సకలభూతములు తాము

పొందు వృద్ధియంతయు సృష్టిప్రవృద్ధికే వినియోగించుచున్నవి. మానవుడు స్వేచ్ఛాపూర్వకముగనే అట్టి త్యాగధర్మ మవలంబించి లోకహితముకొరకై జీవింపవలెనని భగవంతుని సంకల్పము. తద్విరుద్ధముగ వర్తించునేని, వాడు లోకకంటకుడగును. ఆర్జనపరుడు కానివానికి త్యజించుట కేమి యుండును? స్వార్థపరత్వము పరార్థపరత్వమున సార్థకత నెందును. పరిగ్రహాపరిగ్రహముల రెంటియందు మనుజుడు సిద్ధహస్తుడు కావలెను. అట్లగుటకు వలసిన సద్బుద్ధిని బాలబాలికలకు గరపుట కుద్దేశింపబడినదే బ్రహ్మచర్యాశ్రమము. ఆ ధర్మబుద్ధిని యువతీయువకులకు ప్రయోగాత్మముగ నలవరచునదే గృహస్థాశ్రమము. ఆ త్యాగశీలము లోకసంగ్రహముకొరకై వినియుక్తపరచుటకు భార్యాభర్తలను ఆయత్తము చేయునదే వానప్రస్థాశ్రమము. అట్లు పరిపక్వమైన త్యాగశీలముతో మహోదారచరితులై 'వసుధైవ కుటుంబమ్' అని తలపోయుచు దంపతులను జీవించునట్లు చేయునదే సన్యాసాశ్రమము. ఆశ్రమసంస్థ కూడ వర్ణవ్యవస్థవలె వ్యక్తివికాసమునకు వైదిక కాలమున వినియోగపడుచుండెను. మహర్షులు నాడు మహోద్దేశములతో స్థాపించిన వర్ణాశ్రమ విధానములు రెండును నేటి కాలానుగుణముగ మన మనుష్ఠింపవలెను. "తేన త్యక్తేన భుంజీథా"

---

# వైదిక సంప్రదాయము

## 8. వ్యక్తి - సంఘ సమస్య

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభిచాకశీతి.
సమానే వృక్షే పురుషో నిమగ్నో ఽనీశయా శోచతి ముహ్యమానః,
జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్యమహిమాన మితి వీతశోకః.
సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్,
అన్తఃశరీరే జ్యోతిర్మయోహి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః,

——ముండకోపనిషత్ : 3 ముం 1ఖం. 1,2,5వా.

"రెండు పక్షులు పరస్పరసంబంధము గలిగి మైత్రితో ఏకైక వృక్షము (శరీరము) నందు వసించుచున్నవి. వాటిలో ఒకటి (జీవాత్మ) మధురఫలములను భుజించుచుండును, రెండవది (పరమాత్మ) భుజింపక కేవల సాక్షీభూతముగ నుండును. ఆ వృక్షమునకే జీవాత్మ బద్ధమై శక్తి విహీనమై మోహాపరవశమై దుఃఖించు చుండును. సర్వము నియమించుచు పూజనీయమైయున్న పరమాత్మను జీవాత్మ దర్శించునప్పుడు దుఃఖ విమోచన మొందును. శరీరమందు జ్యోతిర్మయమై పరిశుద్ధమై పాపరహితులచే దర్శింపబడునట్టి పరమాత్మ సత్యముచేత, తపస్సుచేత, సమ్యక్-జ్ఞానముచేత, బ్రహ్మచర్యముచేత సదా పొందబడును." ముండకోపనిషత్తునందలి యీ వాక్యములు మానవుని నిజస్వరూపమును, పరిణామమును, పూర్ణసిద్ధిని ఆలం

కారిక భాషలో స్పష్టపరచుచున్నవి. మానవుడు ఏకవ్యక్తిగ గోచరించును. కాని వాని ప్రకృతి ద్వంద్వముగ సాంతమును అనంతమునై యున్నది. సాంతమగు అపరాప్రకృతి సత్య తపో జ్ఞాన బ్రహ్మచర్యసాధనలద్వారా పరాప్రకృతిగ క్రమ క్రమముగా పరిణమించుచు పరాపరముల రెంటికి ఆశ్రయ భూతుడై రెంటిని అతీతించిన పురుషోత్తమునితో నైక్యము కాగలదు. ఈ సాధనమార్గము అంతులేనిది; సదా పరాపర ద్వంద్వములమధ్య సాగునది; గమ్యమయిన సిద్ధికూడ ద్వైతా ద్వైత సహితమగు పూర్ణత్వము. బీజమునందు శాఖోపశాఖ లతో, పత్రపుష్ప ఫలములతో విభిన్నముగను అనేకముగను రూపొందునట్టి యావద్వృక్షము గర్భితమై యున్నది. బీజము అటువంటి ప్రకృతిని తన అంతరమునుండి, భూమి, జలము, వెలుగు, గాలి, ఆకాశము – పంచభూతలతో గూడిన గొప్ప బాహ్యావరణ సంపర్కము ద్వారా, వ్యక్తపరచుకొని తుదకు వాటియందు విలీనమై తన యాదిమ భేదాభేదప్రయు క్తమగు ఏకస్వరూపస్థితిని దాల్చును. సర్వసృష్టి పరివర్తనము ఇదే. మానవాత్మపరిణామము కూడ ఇట్టిదే.

వ్యక్తిత్వమును ఇంక కొంచెము తరచి చూతము. 'నేను శైశవబాల్య కౌమార యౌవన వార్ధక్య దశలను విభిన్న రీతుల గడపితిని. నా యేకత్వమున కెప్పుడును భంగము కలుగలేదు. నాయందలి తత్త్వము ఒక్కటే వివిధవికాసములు గాంచుచు వచ్చెను; ప్రతిస్థితియందు ఫలితము శుభప్రదము

గనె యుండెను ; సర్వావస్థలు దేనికది సుఖదాయకముగనె యుండెను. అవి యన్నియు తాత్కాలిక అనుభవమువలె యయినను అప్పటికప్పుడు సత్య శివ సుందర స్వరూపములై ఆనందమునె గూర్చెను. నిమ్నోన్నతులు, కష్టసుఖములు, ఆత్మ ప్తితృప్తులు జీవితమున లేకపోలేదు. నిరాశనుండి మహోత్సాహము, అధికశ్రమనుండి అమిత సంతోషము, హృదయ విదారకమగు అసంతుష్టినుండి ప్రశాంతిదాయకమగు సంతుష్టి లభించుచు అంధకారబంధురమైపోయినను తిరిగి తిరిగి జ్యోతిర్మయమై నవనవశోభలు గాంచియుండెను.' అని ఆత్మపరీక్ష జేసికొనెడు ప్రతివ్యక్తి గ్రహింప గల్గునని నిస్సందేహముగ చెప్పవచ్చును. మన జీవిత గమన మట్లుండును.

బైసికిల్ ఎక్కిపోవు మనుష్యుని నేర్పరితనము గాంచుడు! వాడు ఏ బంధనము లేని స్వతంత్రుడై, సర్వావయములు సర్వేంద్రియములు స్వాధీనమున గలవాడు, బైసికిల్ అటునిటు పడకుండ బాలెన్సు చూచుకొనుచు ముందునకు నడుపువాడు, రాకపోకలు కలిగి వంకరటింకరగా నున్న వీథులందు అన్ని విధములైన అడ్డంకుల తప్పుకొనుచు జాగ్రత్తగ తన గమ్యస్థానము జేరువాడు. ఆతని అంతరమున సుశిక్షితమై అట్టి సక్రమకార్యరూపము దాల్చగల ఆత్మశక్తి గలదు. అధికతరబుద్ధికుశలుడుగను సంయమసాధకుడుగను ఆత డగుచున్న కొలది బైసికిల్ యంత్రమునే గాక దానికంటె నెక్కువ వేగము గల మోటారు బండ్లను వాయువిమానములను నడుపు సామ

ర్థ్యము బడయును. భౌతిక వస్తువులమధ్య భౌతికయంత్రమున జేరి జరపెడు ఈ ప్రయాణములే గాక, సంఘమున జొచ్చి తన వంటి స్వతంత్రవ్యక్తుల నడుమ లౌకిక వ్యవహారములు, విధి కృత్యములు మానవుడు నిర్వర్తింపవలసి యున్నాడు. ఎక్కడు శిక్షణద్వారా సాంఘికజీవనయాత్రయందు కూడ సాధకుడు విజయు డగును.

ప్రతిమానవుడు ఎంతటి విభిన్నశక్తులు, గుణములు తనలోపల నున్నను వానినెల్ల సమరసపరచుకొని ఏకవ్యక్తిగా ఎట్లు మెలగు చున్నాడో, అట్లే విభిన్నులైన మానవులు పరస్పరసంబంధములలోనికి వచ్చి కుటుంబములు, కూటములు, జాతులు మున్నగు వేర్వేరు సంఘములందు ఏకీభూతు లగు చున్నారు; సామరస్య జీవనముద్వారా వర్ధిల్లుచున్నారు. ఇట్లు సంఘటిల్లెడు ప్రతికూటము ఏకసాంఘిక వ్యక్తిగ గన్పట్టును. ప్రతికూటము సీమబద్ధమైనను క్రమోన్నతి గాంచగల స్వాతంత్ర్యమును గలిగియుండును. సంఘములోని యెల్లరు గాని కనీసము పలువురు గాని ఆమోదించునప్పుడే సాంఘిక పరివర్తనలు జరుగును. బహుజనామోదము గాని నిరసన గాని విషయవిచారణయందు తీవ్రముగ ఏసంఘము ప్రకటించునో అది సజీవముగ, బలిష్టముగ నున్నట్లు భావింతుము. మరియు అది సుదృఢ ప్రజాస్వామ్యము గలదని ప్రశంసింతుము. ప్రజాపాలిత సంఘముయొక్క శాసనములు అందలి వ్యక్తులు ల్లంఘించుచో తప్పక శిక్షింపబడుదురు. అవి నిరం

కుశశాసనము లనబడవు. మానవులు పరస్పరము వ్యక్తి స్వాతంత్ర్యముల మన్నించుకొనుచు ఏకరాజ్యమున నెట్లు సహ జీవనము కలిగియుండుటకు యత్నించుచున్నారో, అట్లే సర్వ కుటుంబములు, సర్వకూటములు, సర్వజాతులు, తదితర సర్వ సంఘములు ఒకదానియెడల ఒకటి సహానవర్తనతో మెలగు టకై ప్రయత్నించుట విధాయకము. మన ప్రధాని జవహా ర్లాల్ నెహ్రూ నేడు ప్రపంచజాతులనడుమ ప్రతిష్ఠించుటకు బద్ధ కంకణుడైయున్న "పంచశీల" విధానము అట్టి సహాన సహ జీవనముకొరకే యుద్దేశింపబడినది. భిన్నస్వతంత్ర వ్యక్తు లందు, అంతే గాక వేర్వేరు సంఘములనడుమ, రాజ్యముల నడుమ అట్టి జీవనము వర్ధిల్లుటే ధర్మము. అదియె ప్రజా స్వామ్యము - డిమాక్రసి - యొక్క లక్ష్యము. యావత్సృష్టి క్రమము ననుసరించి మానవకోటికూడ సామరస్యముద్వారానే సంపూర్ణవృద్ధి గాంచుట సాధ్యము.

ప్రజాస్వామ్యమును సంఘాధికారమును మన్నించుట వ్యక్తులకు విధాయకమైనయెడల, వ్యక్తి తన స్వాతంత్ర్యమును బట్టి, తన యంతరాత్మ ప్రబోధ ననుసరించి స్వధర్మము పాటించు టెట్లు పొసగును? ఇది గట్టి ప్రశ్నయె. దీనికి సరి యైన జవాబు ధర్మస్వరూపులైన మహాపురుషుల జీవితము లందు వ్యక్త మగుచుండును. సాధారణ సంఘజీవితమందు వ్యక్తులు తమ సహజశక్తులను అభినివేశములను అనుసరించి స్వధర్మముల గుర్తెరిగి వాటిని ఆచరించుచుండనిచో, వారు

ఒక మహాయంత్రములో వివిధచక్రములు వాటి పను లవి చేయుచు కనపరచు సామరస్యమె కలిగి యుందురు. కాని సంఘములు యంత్రములవలెను, అందలి వ్యక్తులు చక్రముల వలెను సదా యుండుట చిరనూతనాభివృద్ధి జెందవలనసిన మానవ స్వభావమునకు కేవల విరుద్ధము. మానవాభ్యుదయ మునకు ఆవశ్యకమయిన నూతనచైతన్యము మహావ్యక్తినుండి వెలువడును. ఆతడు తనచుట్టునుండు సామాన్యజనులను మించిన బుద్ధిసంపన్నుడు, వారు అనుసరించు జీవితపద్ధతులందు ఎట్టి మార్పు వచ్చిన సంఘోన్నతి చేకూరునో తెలిసికొను సమర్థుడు, మనస్సుతో దానిని గ్రహించుటయె గాక తన జీవిత మున రూపొంద జేయగల ధీరోత్తముడు, అందులకు సర్వ త్యాగములు -అవసరమైనచో- బలిదానము సయితము చేయ గల మహాత్ముడు. అతడు తన నూతనభావములు తన ప్రబో ధవలన, తన దృష్టాంత జీవితమువలన తోడివ్యక్తులు గుర్తించి స్వీకరించుటకే కోరును, పాటుపడును. తన కేవైన మత సాంఘిక రాజకీయ అధికారము లుండిన, వాటి ద్వారా గాని, తనకు విశేషధనముండిన, లంచములద్వారా గాని, కృత్రిమోపాయములచేత తన సంఘస్థులను తనవైపునకు త్రిప్పుటకు యత్నింపడు. అందులకు కారణము ఆతడు సర్వమానవ స్వాతంత్ర్యము గౌరవించువాడును, తన యభిప్రాయములు తనకు ప్రాణప్రదము లైనట్లె యితరులకు కూడ వారి యభిప్రా యము లుండునని తలంచు ఉదార స్వభావుడునై యుండుటే.

దీపము తనయందలి స్నేహమును తుదకు వత్తినికూడ దగ్ధముచేసి కొని చుట్టుప్రక్కల వెలుతురును ప్రసరింపజేయు విధమున, మహాత్ముడు తన జీవితసమర్పణచేత నూతన జీవనమును సంఘమున వ్యాప్తము జేయును. లోకారాధ్యులైన బుద్ధుడు, జీససు, మహమ్మదు మున్నగు ధర్మాత్ముల జీవితములె అందులకు ప్రబల తార్కాణములు.

త్యాగి యనగా గృహము, సంఘము, రాజ్యము విడనాడి ఏకాకియై అరణ్యావాసము చేయువా డనియో, సంఘమందున్నను ఏవిధులు నిర్వర్తింపక, ఎవరితోను సంబంధములు పెట్టుకొనక, తనపొట్ట నింపుకొనుటకు నెట్టికృషియైనను చేయక బిచ్చగానివలె సంచరించువా డనియో మనకు విపరీతాభిప్రాయములు గలవు. తపోనిష్ఠులై ఆధ్యాత్మిక శక్తులు బడసి సంకల్పమాత్రముననె సర్వకార్యములను సఫలముచేయగల నిశ్చలయోగులు పూర్వ ముండిరని గ్రంథములందు చదువుటయె గాక నేడును ఎక్కడనో అట్టి మహనీయులు గలరని వినుటయు గూడ తటస్థించి మనము త్యాగమునుగూర్చి మనకు గ్రాహ్యములుకాని అభిప్రాయములకు లోనవుదుము. అవి యెట్టివైనను ఆ తపస్సంపన్నులు సయితము క్రియాశీలురె యని మనము గుర్తించుట యావశ్యకము. వారు మూడు విధ విధములైన మనోవాక్కాయ కర్మలలో అతిముఖ్యములైన మనోకర్మలను - స్వల్పచింతనలనే గాక కార్యరూపము దాల్చు మహాసంకల్పములను కూడ - చేయు సిదపురుషులు.

ఆ మహాత్కార్యములు సలుపలేని సామాన్యులెల్లరకు తదితర కార్యములు కర్తవ్యములే గదా ?

శరీరమందు జీవాత్మ, పరమాత్మ అను రెండుపక్షులు వసించుచున్నవని యుపనిషత్తు చెప్పుచున్నది. ఉపమానమునుబట్టి జీవాత్మ, పరమాత్మ యనబడునవి రెండు వేర్వేరుగా నున్నవని మనము భ్రమింప వచ్చును. రెండు తత్త్వములు గల ఏకైకాత్మయె గలదని వైదికఋషి తన యంతరమున దర్శించి యా సాక్షాత్కారమును ఆ తీరున వర్ణించుచు గానముచేసెను. స్వల్పవిత్తనము, బృహద్వృక్షము వేరన గలవా ? ఏకవస్తువే ఒకస్థితియందు కేవల బీజముగను మరొకస్థితియందు కేవల వృక్షముగను గన్పట్టును. జీవాత్మ క్రమక్రమముగా పరమాత్మయందు మిళితమగుచు, కుటుంబముతోను, గ్రామముతోను, దేశముతోను, ప్రపంచముతోను ఐక్యమై తుదకు 'అహం బ్రహ్మాస్మి' అనగల మహానుభూతి బడయును. ప్రథమావస్థలన్నియు, చివరకు అంతిమావస్థయు స్వానుభూతి రహితములు గావు. నేను పరముతో మిళితము జెందుచు విస్తృతి గాంతును. నన్ను గూర్చిన జ్ఞానము – ఆత్మ జ్ఞానము – బ్రహ్మజ్ఞానమునకు మూలము. పరమయోగి 'ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి.''

# వైదిక సంప్రదాయము

## 9 మత సమస్య

అసద్వా ఇదమగ్ర ఆసీత్ । తతో వై సదజాయత ॥
తదాత్మానం స్వయమకురుత । తస్మాత్ తత్ స్వకృత ఇతి । యు

ద్వై తత్ స్వకృతమ్ రసో వై సః । రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి
కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ । యదేష ఆకాశ ఆనందో నస్యాత్ ।
ఏష హ్యేవానందయాతి । యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేన
ఽనిరుక్తే ఽ నిలయనేఽ భయం ప్రతిష్ఠాం విన్దతే । అథ సో ఽ భయం
గతో భవతి । యదా హ్యేవైష ఏతస్మి న్నుదరమన్తరం కురుతే॥ అథ
తస్య భయం భవతి । తత్త్వేవ భయం విదుషో ఽ మన్వానస్య॥

తైత్తిరీయోపనిషత్—2వల్లి, 4అనువాకః॥

"వాస్తవముగా మొదట జగత్తు లేదు. బ్రహ్మము నుండియే జగత్తు పుట్టెను. ఆతడు తనను తాను ప్రకాశింప జేసికొనెను. కావున అతడు స్వయం కర్తయని చెప్పబడును. స్వప్రకాశుడు నిజముగా ఆనందస్వరూపుడు. జీవుడు ఆ యానందస్వరూపుని పొంది ఆనందించును. ఆ యానందమయుడు హృదయాకాశమున లేనిచో, ఎవడు శ్వాసింప గలడు; ఎవడు జీవింప గలడు? అతడే, ఆనంద మిచ్చువాడు. కనుపడని వాడును దేహాతీతుడును పరిపూర్ణుడును ఆవరణరహితుడు నయిన ఆతనియందు జీవుడు నిర్భయాశ్రయము బడసి నిర్భయుడగుచున్నాడు. కాని యెప్పుడు జీవుడు ఈషన్మాత్రము

బ్రహ్మమునుండి తన విభేదము దర్శించునో అప్పుడు భయ మొందును. ఆ స్థితియే జీవబ్రహ్మల ఏకత్వానుభూతి లేని పండితునికిని భయకారణము” అని తైత్తరీయోపనిషత్తు నుడి విన భావము మనోగతము చేసికొందము.

శుష్కపాండిత్యము మన మెంత సంపాదించినను ప్రయోజనము లేదు. సంగతులు తెలిసికొన్నంత మాత్రాన, సత్యము లభ్యముకాదు. తొండను చూచి అది ఒకరు నల్లగా ఉన్న దనెను, ఇంకొకడు పచ్చగా ఉన్న దనెను, మరొకడు తెల్లగా ఉన్న దనెను. ఆ ముగ్వురకు వివాదము పెరిగెను. ఒకరి నొకరు సత్యము చెప్పుట లేదని తిరస్కరించుకొనుచు ఒక పండితునివద్దకు అందరు పోయి సత్యము నిర్ణయింపుడని కోరిరి. ఆతడు తాను చదివిన గ్రంథవిషయములు వివరముగ చెప్పి అది నల్లగాను, పచ్చగాను, తెల్లగాను ఉండునను తన మాటలతో వారిని సమాధానపరుప యత్నించెను. మనము ఊహించుకొన దలచినచో మన మది యింకెన్ని రంగులు గలదియైనను అయియుండునని యూహించుకొన వచ్చుని, తాను ప్రత్యక్షముగా చూచినదే దాని రంగు అని వారిలో ఒక్కొక్కడు తీవ్రముగా నొక్కి పలుకుచు పండితుని మాటలకు నవ్వెను. తరువాత వారు తమ యిండ్లకు బోవుచు దారిలో కట్టె లమ్మువానిని కలసిరి. వాడు కట్టెలు కొట్టి తెచ్చుటకు పలుమారు అడవికి బోవును కాబట్టి తొండను తరచు చూచియుండు నని, యాథార్థ్యము తెలుప గలడని

భావించి వా రాతనిని తొండరంగు ఎట్టిదని ప్రశ్నించిరి. ఆతడు వెంటనే తొండ ఒకప్పుడు నల్లగాను, ఒకప్పుడు పచ్చగాను, ఒకప్పుడు తెల్లగాను కనబడుచుండునని, తా నట్టుల చాల సార్లు చూచితి నని జవా బిచ్చెను. వాని మాటలు చిత్రముగా దోచినను, వారు ముగ్గురు తొండలను తిరిగి వేర్వేరు సమయములందు చూచి వాడు చెప్పినదే పూర్ణసత్యమని, తాము మొదట తెలిపిన అంశములు కొంతవరకే సత్యములని గమనించిరి. లోకములో ఇట్టి పలుగాథలు లేనియెడల, చదువు కొన్నవానికంటె చాకలి మెరుగను సామెత యూరక పుట్టదు. ప్రత్యక్షానుభవము లేని పుస్తకజ్ఞానమువల్ల సత్యము ఇదమిద్ధమని చెప్పుట యసాధ్యము. పండితుడు వట్టి మాటల ప్రోగు. ఆతని మాటలు ఎన్ని శాస్త్రప్రమాణములతో గూడియున్నను నమ్మదగి యుండవు. అనుభవజ్ఞుని మాటలకు ఎంతో విలువ ఈయబడును. అవే సత్య మారయుటకుతోడ్పడ గలవు.

"య ఏకోఽ-వర్ణో బహుధా శక్తియోగాత్ వర్ణాననేకాన్నిహితార్థో దధాతి" — రూపరహితుడైన ఏకస్వరూపుడు తన గుహ్యాతమ సంకల్పముల సంసిద్ధికై తన వివిధశక్తులతో అనేకనామములు, గుణములు గల విషయముల సృజించుచున్నాడు—అని శ్వేతాశ్వతరోపనిషత్కారుని యనుభవపూర్వక వచనములు. భగవంతుడు జగత్తున అనంతరూపములతో ప్రత్యక్ష మగుచున్నాడు. ఆతనిని సత్యస్వరూపుడని, జ్ఞానస్వరూపుడని, ఆనందస్వరూపుడని, శివస్వరూపుడని,

శాంతస్వరూపుడని, శుద్ధస్వరూపుడని ఇట్లనేకవిధముల కొని యాడుచు నిర్గుణుడైన ఆతనికి బహుగుణములు కలవనియు, ఆతనిని తల్లియని, తండ్రియని, గురువని, సఖుడని, నాథుడని, ప్రభువని, రాముడని, కృష్ణుడని, క్రీస్తని, అగ్నియని, జలమని, ఇట్లనేకనామములతో స్తుతించుచు నిరాకారుడైన అతడు పరమ హితుడగు అనంత రూపధారియనియు ఋషులు, భక్తులు, జ్ఞానులు వ్యక్తీకరించుచున్నారు. పరిమిత బాహ్య రూపములు మాత్రము స్థూలదృష్టికి గోచరించును. వాటి యందే సూక్ష్మదృష్టి అనంతములైన దివ్యగుణములు, అద్భుతశక్తులు గాంచును. అప్పుడవి విభూతులుగ, ఈశ్వర స్వరూపములుగ పరిగణింపబడును. అవి పరిమితములయ్యు అపారమహిమను ప్రదర్శించుచు దృష్టిని పరమాత్మని వైపునకే మరలించును. అవి నిమిత్తమాత్రములె. 'నేదం యదిద ముపాసతే.' — ఏది యిది యని యుపాసింతురో అది బ్రహ్మము కాదు — అని వేదఋషుల అనుభవ సిద్ధ ప్రవచనము కలదు. కనుక "యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్" అను భగవద్గీతా వాక్యానుసారము భగవానుని ఎట్లు సమీపించువారైనను, భగవానునికి ఆదరపాత్రులె. భగవద్భక్తులు విభిన్నమతా వలంబులైనను వివిధమార్గానువర్తులైనను పరస్పరప్రేమా న్వితులగుచు ఏకప్రేమస్వరూపుని సంతానముగ మెలగుట విధాయకము. ఎవరి యనుభవము వారు పూర్ణసత్య నిమ

వివాదపడువారు భగవద్భక్తు లని యెంచ దగరు. భగవంతుడు జగత్పిత యని, సర్వమానవులు సహోదరు లని విశ్వసించుచు, తదనుగుణముగ ప్రవర్తించుటయే హిందూ మహమ్మదీయ క్రైస్తవాది సమస్త సన్మతముల మూలపురుషుల యొక్కయు, ప్రముఖభక్తులయొక్కయు లక్ష్యమై యున్నది గదా? అన్ని మానవసంస్థలవలె మతోద్యమములు సయితము కాలక్రమమున సంకుచితములు, కలుషితములు అగుచుండును, కాన అవి సదా సంస్కరింపబడుట యావశ్యకము. అందులకు మహాపురుషులు అవతరించుచునె యున్నారు. వివేకవంతులమై ఆ యవతారపురుషుల యడుగుజాడల నడతుము గాక! మతముల పేరిట లోకములో అశాంతి, కలహము పెంచక శాంతిని, మైత్రిని ప్రతిష్ఠించుటకే పాటుపడుదుము గాక! మతమునకు జీవితముతో విడరాని సంబంధము గలదు. అది దోషయుత మగుచుండినచో పరిష్కరింప వలసినదే గాని, నిర్మూలింప నలవి కానిది. వైదికసంప్రదాయమునకు నిలయమైన భారతవర్షము నేడు మతసమన్వయమునకు ముఖ్యముగ కృషిసల్పుచు దాని సర్వతోముఖ స్వరూపమును ప్రపంచమునకు ప్రదర్శింప వలదా?

"ఓగార్గి! ఈ అక్షరపురుషుని శాసనమువల్ల సూర్యచంద్రులు, సర్వలోకములు, నిమిషములు, దినములు, మాసములు, సంవత్సరములు, ఋతువులు, హిమాచలాది పర్వతములు, సింధు, గంగ మున్నగు నదులు, సమస్త చరాచర

ములు నిలచి క్రమము తప్పక వర్తిల్లుచున్న” వని బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యుని ప్రబోధవాక్యములు గలవు. ఈశ్వరుని మహాశాసనమె ధర్మము. సృష్టిలోని ప్రతివస్తువు, ప్రతిజీవి స్వీయవిధుల నిర్వహించుచు ధర్మబద్ధములై యున్నవి. ధర్మము సృష్టిజాలమందు వివిధముగ గానవచ్చుచున్నను, ఏకైకపరమేశ్వరునినుండి వెడలుటచే, సామరస్యముతో సర్వము పాలించుచు యావద్విశ్వమును సమైక్యముగ వర్తిల్ల జేయుచున్నది. ప్రాపంచిక కార్యము లన్నియు ధార్మికములె. నేటి మన ప్రజాప్రభుత్వము లౌకిక (Secular) ప్రభుత్వమని వ్యవహరింపబడుచున్నది; కాని దాని జాతీయపతాకము భిన్నమతస్థులను సూచించు భిన్న వర్ణములతోను, వారినెల్లరను సమరసపరచు ధర్మమునకు చిహ్నముగా ఆ రంగులమధ్య ధర్మచక్రముతోను శోభిల్లుచున్నది; భారతజాతీయాదర్శము సర్వమానవమైత్రి సమకూర్చు “పంచశీల” ధర్మమని ప్రకటింపబడుచున్నది; మన స్వదేశీయ విదేశీయవ్యవహారములు దానికి అనుగుణముగ జరుగుటకై శ్రద్ధచూపబడుచున్నది. అధికక్లిష్టపరిస్థితులమధ్య మెలగవలసివచ్చు చున్నను, భారతదేశమునకు ఇట్టి గౌరవము సమకూర్చిన మన ప్రధాని నెహ్రూ ప్రశంసాపాత్రుడు. ఆతనికి కుడిభుజముగా నుండిన సర్దార్ వల్లభాయిపటేల్, ప్రతిపక్షనాయకుడుగా నుండిన శ్యామ్‌ప్రసాద్ ముఖర్జి మన పార్లమెంటునందు ప్రముఖులయి మన ప్రజాప్రభుత్వమునకు

గొప్ప మేలు చేసియుండిరి. నేడు భారత దేశమున అట్టి యథార్థనాయికులు బయలుదేరి ప్రధానినెహ్రూకు చేదోడు, వాదోడుగా నుండి లభించినప్రజారాజ్యము ఐకమత్యము కలిగి సర్వైశ్వర్యములతో తులతూగునట్లు జేయుదురుగాక ! భారత వర్షము ధర్మక్షేత్ర మని, సర్వమతములను సకలజాతులను సన్మానించు ధార్మిక కేంద్ర మని తిరిగి పేరొందునట్లు పాటు పడి వైదికసాంప్రదాయఘనతను నిలువ బెట్టుదురు గాక !

అమెరికా గాని రష్యాగాని యింకే దేశము గాని కేవల ప్రపంచాధిక్యత కొరకే పోరాటము సలుపుచున్నదని తలంచు టకు వీలులేదు. ఆయా దేశములు మహోన్నత్య మందు టకు కొన్ని ధార్మికాదర్శములు గలవు. వాటిని కాపాడు కొను ఆకాంక్ష కూడా ఆ దేశముల ప్రయత్నములందు కాన్పిం చును. అమెరికా స్వాతంత్ర్యమును, రష్యా సమత్వమును తీవ్రముగ వాంఛించుచున్నవి. రష్యాలో అనుసరింపబడు సమత్వము స్వాంత్ర్యాదర్శమును భంగపరచు నని అమెరి కాకు, అమెరికాలో ఆచరణ యందున్న స్వాతంత్ర్యము సమత్వాదర్శమునకు భంగకర మని రష్యాకు భయము. కాని ఆ రెండు ఆదర్శములు ప్రజాప్రభుత్వము (Democracy) నకు ఆవశ్యకములే యని యంగీకరింప బడుచున్నవి. వాటిని సమ రసపరచి సక్రమముగ అనుష్ఠించి భారతభూమి లోకమున కేల మార్గదర్శి కాగూడదు ?

లౌకికము, ధార్మికము అనునట్టియు స్వాతంత్ర్యము,

సమత్వము అనునట్టియు ద్వంద్వములను మాత్రము మనము కొంత యిపుడు చర్చించుకొంటిమి. ఇట్టి ద్వంద్వములు త్యాగ భోగములు, అనురాగవైరాగ్యములు, అపరిగ్రహ పరిగ్రహములు, అహింసా హింసలు, సుఖదుఃఖములు మున్నగునవి అనేకము గలవు. వీటి నన్నిటిని సమన్వయించి జీవితమున తగిన స్థానములం దుంచిన గాని మానవులు క్రమాభివృద్ధి గాంచనేరరు. వివిధ ప్రవర్తనలు వ్యక్తులయందు తప్పక ఉండును. సమన్వయ మనగా వాటి నెల్ల తుడిచిపెట్టుట కాదు. ఎవరి వర్తనకు తగినస్థానమున వారుండి క్రమముగా ధర్మ సోపానపరంపర నధిరోహించుచు పరిణామ మొందుటకు దారి జూపు సువర్ణసూత్రమే సమన్వయము. వైదికకాలమునుండి సమన్వయ సంస్కృతి భారతవర్షమున స్థిరస్థాయి నొందుటకు, విదేశములలోనికి సయితము అప్పుడప్పుడు విస్తరించుటకు కారణము, అది భారతహృదయమున పాదుకొనుటే. నాజిజమ్ అని, ఫాసిజమ్‌అని, సోషలిజమ్ అని, కమ్యూనిజమ్ అని యిట్లు మనమిప్పుడు అనేక వాదముల పేర్లు వినుచున్నాము. వాటిని అర్థము చేసికొనుటకు పాశ్చాత్య చరిత్రలు తిరుగవేయుచున్నాము. అవి కొన్ని పరిస్థితుల ననుసరించి యేర్పడినవి. మన కెంతకును బోధపడవు. వైదికసంప్రదాయ సిద్ధమయి మనదేశమున నేటికిని ప్రజ్వలరూపమున పొడగట్టు సమన్వయ వాదము మనముచేపట్టి పాటింతము. "బ్రహ్మవాదినోవదంతి" బ్రహ్మవాదులు నేమను దానిని చాటుచునే యున్నారు.

---

# వైదిక సంప్రదాయము

## 10. వివాహ సమస్య

యథా నద్యః స్యన్దమానాః సముద్రే
ఉస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,
తథా విద్వాన్నామరూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్.
సయో హ వైతత్ పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి.
నాస్యా బ్రహ్మవిత్ కులే భవతి,
తరతి శోకం తరతి పాప్మానం
గుహాః గ్రన్థిభ్యో విముక్తోఽమృతో భవతి.

— ముండకోపనిషత్ 2 ముం. ద్వి. 8, 9. వా.

"ఏవిధముగా ప్రవహించు నదులు సముద్రమందు నామ రూపముల విడిచి యదృశ్యము లగునో, ఆ విధముగా విద్వాంసుడు నామరూపముల త్యజించి సర్వోత్తమ దివ్యపురుషుని జేరును. పరబ్రహ్మను తెలిసికొన్నవాడు నిజముగా బ్రహ్మయే యగును; వాని కుటుంబమున బ్రహ్మను ఎరుగని వాడు జన్మింపడు; వాడు దుఃఖమును అతీతించును, పాపమును అతీతించును, హృదయబంధమునుండి విడివడి చిరంజీవి యగును" అని ముండకోపనిషత్తు ప్రకటించుచున్నది.

పండితుని గూర్చి భగవద్గీత ఏమి చాటుచున్నదో ఆలకింతము. "మృతిజెందిన వారినిగురించి గాని జీవించియున్న వారినిగురించి గాని పండితుడు శోకింపడు. ఏలయన, ఇదివర

కెన్నడును నేను గాని నీవు గాని ఇతరులు గాని లేకపో లేదు ; మన మందరము ఇక ముందు నుండకపోము. ఈదేహ మందున్న ఆత్మకు కౌమార యౌవన వార్థక్యము లనెడు ఆవస్థలు కలుగుచున్నట్లే, ఆత్మ భావికాలమున గూడ మరొక దేహము దాల్చును. ... నిత్యమగు ఆత్మను గప్పియున్న శరీరము అంతము గలది. ... ఆత్మ చంపునని తలచువాడు, చంపబడునని తలచువాడు ఇరువురును ఆత్మతత్త్వము నెరుగనివారే. అది చంపునది కాదు ; చంపబడునది కాదు...దానిని ఆయుధములు ఛేధింపజాలవు, అగ్ని దహింపజాలదు, జలము తడుపజాలదు, వాయువు శుష్కింప జాలదు...అది నిత్యము, సర్వగతము, స్థిరము, అచలము, సనాతనము"

ఈపై వాక్యములందు ఉపనిషత్తు, భగవద్గీత రెండును ఆత్మయొక్క అమరత్వమును రూఢిగ ప్రతిపాదించుచున్నవి. ఉపనిషత్తు ఆత్మలోప లబ్ధి గాంచిన బ్రహ్మవిదుని సంతతిలక్షణమును కూడ నిరూపించుచున్నది. ఈ వ్యాసమున చర్చనీయాంశము సంతతి లక్షణమును గురించియె. అయినను ముందుగ బ్రహ్మవిదుని లక్షణముగ ముండకోపనిషత్తు చెప్పినది బాగుగ తరచి బోధపరచుకొనుట ఆవశ్యకము. ఆ యుపనిష ద్వాక్యమందు వాడబడిన శబ్దము "విహాయ" అగుటచే విద్వాంసుడు బ్రహ్మమై పోవుటతో నామరూపములు విడిచి బ్రహ్మయందు లయమై తన వ్యక్తిత్వము గోల్పోవునని మనకు తోచవచ్చును. ఆభావన సరియైనది కాదు.

పూర్వప్రకరణములందు మనము సమగ్రముగ పరిశీలించి వైదిక ఋషులు ఆత్మను గురించి భేదాభేదతత్త్వమును వెల్లడించిన వారేయని నిరూపించుకొన్నాము. ఆత్మ అభేదముగ ఏకమై యున్నను నామరూపభేదములతో సదా అనేకముగ నుండు నని తేల్చుకొంటిమి. ఆ విషయమునే ఉపనిషత్సార గ్రంథ మని ప్రసిద్ధిగాంచిన భగవద్గీత సుస్పష్టముగా పైనుదహరింప బడిన వాక్యములలో నుద్ఘోషించు చున్నది. జీవులు పరమా త్మతో నైక్యమయి యుండియే యీ జీవితములోనే గాక మరణానంతరము సర్వజన్మలలో కూడ నానా రూపముల దాల్చుచు గుర్తింపబడుటకై వివిధనామములతో పిలువబడు చుండును. బహుభంగుల విరాజిల్లుచుండును. జీవాత్మ సూక్ష్మాతిసూక్ష్మ రూపమును మహదాతి మహద్రూపమును ధరించ గలదు. అంతే గాని అది యెప్పుడును రూపరహిత ముగా నుండదు. సృష్టివిధానమె అట్లున్నది. స్రష్టతోపాటు సృష్టియు అనంతము, సనాతనము. "విహాయ" అను పదము 'విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః నిర్మమో, నిరహంకారః, సశాన్తి మధి గచ్ఛతి" అను గీతా వాక్యములో నెట్టిసందర్భమున ప్రయోగింపబడెనో గాంచుడు. కోరికలు విడిచి నిస్పృహుడు, మమత్వరహితుడు, అహం కారశూన్యుడు అయి చరించుటయె జీవుని గమ్యమని వ్యక్త పరచు సందర్భమందే ఉపయోగింపబడెను. "యస్తు కర్మఫల త్యాగీ సత్యాగీత్యభిధీయతే" ఎవ్వడు కర్మఫల త్యాగము

చేయునో వాడు త్యాగియని వ్యవహరింపబడు నని కూడ భగవద్గీత నిర్వచించుచున్నది. త్యాగము శారీరక కర్మలను గాక వానియందలి ఫలాపేక్షను విసర్జించుటయె యని గీత కనపరచుచున్న యాదర్శము. అదియె వైదికాదర్శమని కూడ మనము గ్రహింపవలెను, లక్ష్యమందుంచు కొందము. నామరూపములు విడుచుట యన వాటి యందలి యాసక్తిని విడుచుటే యనుట సమంజసము.

ఇక ఈ వ్యాసవిషయము నెత్తుకొందము. అది 'బ్రహ్మవిదుని కుటుంబమున బ్రహ్మవిదుడు కాని వాడు పుట్టడు' అని ఉపనిషత్తు నిస్సందేహముగా వక్కాణించుచున్న గొప్ప సత్యము. మన మిప్పు డది పరిశీలింప వలసియున్నది. మంచి బీజము మంచి క్షేత్రమునమంచి ఫల మిచ్చును. గొప్ప ఆబోతునకుగొప్ప ఆవువలన గొప్ప దూడ పుట్టును. పులికిని పులికిని పులి జన్మించును. మేకలకు మేక కలుగును. ఒక జాతి వృక్షములలో గాని ఒక జాతి జంతువులలో గాని శ్రేష్ఠములగువాని సంయోగము వల్లనే ఆయా జాతులందు శ్రేష్ఠ సంతానము లభించును. సహజముగా ఏకజాతీయ సమాన వ్యక్తులకే దాంపత్యము సంఘటిల్లును. తద్వారా అన్ని జాతులు సుసంతతి బడయుచు వర్ధిల్లును. జంతు వృక్షాది మానవేతర సకలజాతులు మానవ కృత్రిమ విధానములకు లోనుగానిచో ఒకేవిధమైన సంతానమునకు సదా కారణభూతములై స్వభావములందు పరివర్తనలు లేక కలకాలము ఒక్క-

విధముగానె యుండిపోవును. మానవజాతుల విషయమున అట్లు చెప్పుటకు వలనుపడదు. మానవ వ్యక్తుల స్వభావములు నిరంతరము పరివర్తన జెందుచుండును. ఆ మార్పు ఒకప్పుడు వృద్ధికి, ఒకప్పుడు క్షయమునకు సంబంధించి యుండవచ్చును. మానవులు స్వతంత్రశీలురు, సర్వదా మార్పునొందుచుందురు కావున మనుష్యుడు నిన్న ఉన్నస్థాయిని నేడు ఉండడు; నేడు ఉన్నస్థాయిని రేపు ఉండడు. ఈ పరివర్తనా శీలమునకు సాంఘిక సాంగత్యము తోడగును. సత్సాంగత్యము సద్వర్తన, దుస్సాంగత్యము దుర్వర్తన పెంపొందించును. జన్మ (Heridity) వల్ల ఒకడు పొందిన సంస్కారము వ్యక్తి స్వాతంత్ర్యము(individual liberty వల్లను, సాంఘిక సాంగత్యము (Social environment) వల్లను మారును. ఇట్లు మార్పు జెందు నారీనరులు తమ తమ యోగ్యతల కనుగుణముగ పరస్పరాకర్షణ కలిగి దాంపత్యమున సమైక్య మగుట సహజ మానవ లక్షణము. దీనికి భిన్నముగ కృత్రిమ సాంఘికాచారములచే గాని తల్లిదండ్రుల నిర్బంధచర్యలచే గాని బలిష్టుల నిరంకుశ దౌర్జన్యములచే గాని విమోహకుల ప్రలోభనములచే గాని యేర్పడు దాంపత్యములు తాత్కాలికములు, దుఃఖహేతువులు, సంఘ వినాశకరములు.

కేవలజన్మను బట్టి ఏర్పడిన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కులములలోనివారే వివాహితులు కావలెనను పద్ధతి దురాచారమే; కాని గుణకర్మలను బట్టి ఆ యా వర్ణనామముల

ధరించు వారిలో సజాతీయ సమాన స్త్రీ పురుషులకు వివాహా ములు జరుగుట సదాచారము. పూర్వకాలమున హిందూ సంఘమున అట్టి సదాచారము వెలసియుండెను. జన్మనుబట్టియే గాక స్వభావమునుబట్టి కూడ బ్రాహ్మణుడైన వశిష్ఠుడు నాలుగు వర్ణములకు జెందక సంఘమునకు దూరముగ నుండి పోయి పంచములని పిలువబడువారిలో పుట్టిన అరుంధతి పరమ యోగ్యురాలని కనిపెట్టి ఆమెను పెండ్లిచేసికొనెను. నేటి కాలమున సామాన్యముగా వివాహసంబంధములందు జన్మకే ప్రాధాన్య మీయబడుచున్నను, అట్లు జరిగెడు వివాహసమ యములందు వధూవరులకు ఆదర్శదంపతులగు అరుంధతీ వశిష్ఠుల పేర బరగుచు వారి స్మరణచిహ్నములై నిత్యసన్నిహిత సంబంధమున సదా చరించు నక్షత్రములు చూపబడుట యెల్ల రెరింగిన విషయమే. ఈ ఒక్కయంశము జన్మయే గాక గుణ కర్మలు కూడ దాంపత్య నిర్ణయమున ముఖ్యముగ విచారణీ యములని హిందువుల యాశయమైనట్లు ఋజువు చేయగలదు. సాంఘికాచారదాస్యము, ఇంద్రియ ప్రేరిత వ్యామోహము, అనుచిత ధనకాంక్ష మున్నగు నికృష్ట కారణములవల్ల సమ కూడు దాంపత్యములు మానవులను మానసిక అధోగతికి దింపును. మానవులు తమ మనస్సులను ఊర్ధ్వమార్గమున నడపుచు అంతకంతకు నుత్తమస్థితులను బడయుటకై గావించు కొనెడు సవర్ణవివాహములు మాత్రమే వాంఛనీయములు, శ్రేయస్కరములు. అట్టి సరియైన పరిణయముల మూలమున

బీజక్షేత్రములకు సామరస్యము చేకూరి శ్రేష్ఠతర శ్రేష్ఠతమ సంతాన ముద్భవిల్లి వర్ధిల్లును. ఇంత పరిశీలనము జరుపుకొన్న పిమ్మట, "నాస్యాబ్రహ్మవిత్ కులే భవతి" అనెడు ఉపనిషన్ని ర్ణయము మనము శంకించుట కవకాశము లేదనియే చెప్ప వచ్చును. అయినను ఇంకను పర్యాలోచింపుడు.

బ్రహ్మోపలబ్ధి, వృత్తికుశలత—ఈరెంటి మిళిత జీవ నము వైదిక ఋషులసంతతియందు పాదుకొని పెంపొందుచు వచ్చెను. ఆదినుండీ నేటివరకు ఆ వైదిక సంప్రదాయము భారత దేశమున జీవనదివలె సంతతధారగా ప్రవహించు చున్నది. వైదిక ధర్మజీవనము కేవలము ఆధ్యాత్మికము గాదు. సంఘజీవనమునకు వలసిన భిన్నభిన్నములైన సకల వృత్తుల ద్వారా వ్యక్తమగుచు వాటినెల్ల ధార్మికముజేయు జీవనమె వైదిక ధర్మజీవనము. అనగా, అర్థ్యాది ధర్మార్థ కామ మోక్షము లనబడు నాలుగు పురుషార్థల సమన్వయ జీవ నము. అది మన దేశమున ఒకప్పుడు వెల్లువలై ప్రవ హించుచు ఒకప్పుడు కొలదిమంది బ్రహ్మసాధకుల యందు మాత్రమే పొడగట్టుచుండెను. వర్ణాశ్రమవిధానములు రెండును సక్రమముగ ననుసరించుటయే బ్రహ్మసాధన. ప్రతికూల పరిస్థితులవల్ల హిందూ సంఘమున బ్రహ్మసాధనకు తగినంత ప్రోత్సాహము లేక వైదికసంప్రదాయము అప్పుడప్పుడు కొందరిలోనే పరిపోషిత మగుట తటస్థించెను. అంతేగాని అది యెన్నడు పూర్తిగ శుష్కించి పోలేదు. వర్ణాశ్రమవ్యవ

స్థలు ఎంతగా సంఘము మొత్తముమీద భ్రష్టత జెందినను, కొందరు ఎల్లప్పుడు వాటిని క్రమపద్ధతి ననుసరించుచునె యుండిరి. వారిద్వారా వైదికసంప్రదాయము తిరిగి తిరిగి నూతన చైతన్యముతో విలసిల్లుచు సంఘమున విస్తరించుచుండెను. వంశపారంపర్యముగా భారతీయులకు లభించిన భాగ్యములలో వైదిక సంప్రదాయము మహాభాగ్యము.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణములవారు తమ తమ వృత్తులయందు బ్రాహ్మిస్థితి కలిగి స్థితప్రజ్ఞులు అగుటకు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాస ఆశ్రమములు నాలుగును వారు క్రమముగా పాలించుట అత్యావశ్యకము. సహజరీతిని వృత్తులను, ఆశ్రమములను మనము చక్కగా నలవరచుకొన్నచో, భారతదేశము ప్రస్తుతము తాను పొందియున్న స్వరాజ్యమును దృఢపరచుకొని ఉత్తమ రాజకీయ సాంఘిక జీవనము లోకమునకు చూపగలదు. మనము బ్రహ్మసాధనకు గడంగుదము; హిందూజీవన పథమున పురోగమింతము.

---

# వైదిక సంప్రదాయము

## 11. ఈశ్వర కృప

నాయమాత్మా ప్రవచనేన లభ్యో
న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్.

— కఠోపనిషత్తు: 1 అ, 2వ, 22 వా.

"ధర్మగ్రంథములు పఠించుటవలన, స్మరించుటవలన, వినుటవలన పరమాత్ముడు పొందబడడు. పరమాత్మ డెవనిని అనుగ్రహించునో (అనగా పరమాత్ముని యనుగ్రహము నకు ఎవడు పాత్రుడగునో) వానికి ఆయన తన స్వరూపమును ప్రత్యక్షము జేయును." అని కఠోపనిషత్తు చెప్పుచున్నది. ఋక్, యజుః, సామ, అథర్వ వేదములు, వేదాంగములు అపరా విద్య లనియు, అక్షరస్వరూపుడైన పరమాత్ముని ఎరుకపరచు నది పరావిద్య యనియు, కర్మలవలన పొందబడు పదవులు అని త్యము లనియు, సాధకుడు వాటి క్షణభంగురత్వము గుర్తించి వాటియందలి అనురాగము వీడవలె ననియు, కృతమువల్ల అకృతుడగు పరమాత్ముడు లభ్యుడు గానేరడు గాన ఆయనను తెలిసికొనుటకై వేదపారంగతుడే గాక బ్రహ్మనిష్ఠుడు కూడ నయిన గురువును ఆశ్రయింపవలె ననియు, అట్లు విరాగియై "సమ్యక్ ప్రశాంతచిత్తుడును" "శమాన్వితుడును" కాగలిగి

తనను సమీపించు తత్సాధకునకు ఆ సద్గురువు అక్షరసత్య స్వరూపుని సాక్షాత్కరింప జేయునట్టి బ్రహ్మవిద్యను సక్రమముగ గరపు ననియు ముండకోపనిషత్తుయొక్క 1-5,11-12,13, శ్లోకములందు విశదపరుపబడినది.

భగవంతుడు ప్రకృతియందు ప్రకాశించుచున్నాడు; ప్రకృతి యందుకంటె అధికముగ సామాన్య మానవులందు, సామాన్య మానవులందుకంటె అధికతరముగ మహాత్ములందు ప్రకాశించుచున్నాడు. అగ్ని కట్టెలందు కలదు కాని వాటిని ఒరపిడి చేసినప్పుడే కనబడును. వాటియందు మొదట రగిలెడు స్వల్పాగ్ని వాటినె బాగుగ వెలిగింపజాలదు! వాటికి చేర్చబడు కట్టెలను అసలే మండింప నేరదు; అవి జ్వాజ్వల్యమానముగ మండునప్పుడు ఎన్ని కట్టెలనయినను, పచ్చిగా నున్నప్పటికిని, ప్రజ్వరిల్ల జేయగలవు. అట్లే ప్రకృతిమూలముననను, సాధారణ మానవుల ద్వారాను బ్రహ్మతేజస్సు సుస్పష్టముగా వ్యక్తము కాజాలదు. బ్రహ్మజ్ఞానముతో తేజరిల్లు మహాత్ములు తమ జ్ఞానాగ్నిచే ఎట్టి స్థితిలో నున్న మానవుల నయినను వెలిగింప గలరు. వారి దోషముల దగ్ధముచేసి వారి యాత్మలను విజ్ఞానవంతములు గావింప గలరు. అట్టి మహాత్ములే సద్గురువు లని పిలువదగినవారు. వారి స్పర్శసాంగత్యములు మహాశక్తివంతములు. వాటివల్లనె శిష్యులయందలి మహత్తరపవిత్రజీవనము జ్వలించి విజృంభింప నేర్చును. "విజ్ఞానాత్మా సహ దేవైశ్చ సర్వైః ప్రాణా భూతాని సంప్రతిష్ఠన్తి యత్ర, తదక్షరం

వేదయతే యస్తా సుస్యు సర్వజ్ఞః సర్వమేవావివేశ" - జీవాత్మ సర్వేంద్రియములతో, సర్వప్రాణశక్తులతో, సర్వభౌతికశరీరముతో ఎవనియందు బాగుగ ప్రతిష్ఠితమై విజ్ఞానవంతమై యుండునో ఆ యక్షర పరమాత్మని తెలిసికొన్నవాడు సర్వజ్ఞుడును సర్వాంతర్యామియు నగును - అని ప్రశ్నోపనిషత్తు (IV -11 శ్లో.) సువ్యక్త పరచుచున్నది. బ్రహ్మనిష్ఠుడైన మహాత్ముడు సర్వజ్ఞుడును సర్వాంతర్యామియు కాగలుగును. అట్టి మహాత్ముడే ఉత్తమగురువు.

శ్రేష్ఠగురువులు తమను సమీపించు మనుష్యుల మనస్తత్వములు తత్‌క్షణమె తెలిసికొని క్రమశిక్షణ నీయగలరు. ధనేషణ, దారేషణ, పుత్రేషణ మున్నగు ఆసక్తులుగలవారు శమాన్వితులు గానేరక తమ బుద్ధిని బ్రహ్మసాధనలో నియుక్తము చేయజాలరు. అట్టివారిని విషయవాంఛల విడచునట్లు హెచ్చరించుట మిక్కిలి యావశ్యకము. మనస్సులు నిష్కామ ప్రకృతినె గాక ప్రశాంతస్థితిని గూడ బడసిన గాని క్రమముగా దర్శన, ధారణ, సమాధుల పొంది సాధనగమ్యము చేరజాలవు. కావున ఉద్వేగచిత్తులను సంపూర్ణ ప్రశాంతశీలు రగునట్లు ప్రోత్సహించుట చాల ముఖ్యము. మరియు మానవులు తమ స్వభావముల కనుగుణమైన కార్యములందు ప్రవీణు లగుదురు; వాటియందె అభిరుచి కలిగియుందురు; వారు తమ తమ సహజకర్మలు-వృత్తులు-సలుపుచు జన్మసాఫల్యము జేసికొనవలసియుందురు. కాన ప్రతివ్యక్తియందు

ప్రత్యేకలక్షణములతో గర్భితమైయుండు స్వభావము వెలువడ జేయుట అత్యవసరము. "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అని భగవద్గీత స్పష్టముగ చెప్పుచున్నది. ఉత్కృష్టగురువులు సర్వజ్ఞులును, సర్వహృదయాంతరవర్తులును కాన, శిష్యుల మనస్సులందు ప్రవేశింప గలరు; వారి విషయాసక్తులను దెలిసికొని వారిని నిష్కాములజేయ గడంగుదురు; వారి మనోద్రేకముల నెరింగి వారిని స్థిరచిత్తుల జేయ ప్రయత్నింతురు; వారి కార్మికాభినివేశముల గమనించి తదనుగుణమైన కార్మికవిద్యలు నేర్పుటకు పాటుపడుదురు. వైదిక ఋషులు ఇవ్విధమున తమ యనుచరుల యభ్యున్నతికై కృషి సలిపియుండుట పూర్వ ప్రకరణములందు చెప్పుకొని యున్నాము. ఆ వైదిక గురూత్తముల విషయము తిరిగి చర్చించుట చర్వితచర్వణము కాబట్టి యితర గురువరేణ్యుల ప్రభావము నొకింత స్మరింతము.

వైదిక కాలపు కర్మకాండ చాలవరకు శుష్కాడంబరమై నిరుపయోగముగా నున్నప్పుడు, నిత్యానిత్య వస్తువివేకానంతరము పొడసూపెడు వైరాగ్యము వస్తువులయెడ కలిగెడు అనిత్యవైషయిక కాంక్ష త్యజించుటలో గాక వస్తువులయెడ నుండవలసిన ఆత్మీయ నిత్యప్రేమనె విడనాడుటలో కన్పట్టుచు బాహ్యసన్యాసమై అనర్థదాయకముగా నున్నప్పుడు, బుద్ధభగవానుడు ఉద్భవిల్లి పవిత్రప్రేమ సందేశ మొసంగెను. ఆతడు ప్రేమావతారముగా పరిగణింపబడెను. అవతారపురుషులు

స్వతస్సిద్ధమగు మహాచ్ఛక్తిసంపన్నులు. వారు జన్మించినది మొదలు తమ యద్భుతప్రభావము తమంతట తామె కనపరచుచు క్రమక్రమముగా సర్వత్ర ప్రకాశింపజేతురు. ప్రతి వ్యక్తికి జన్మతోడనె ఏదో ప్రత్యేకశక్తి లభించినను, వాని జీవితములో నది పరుల సాహాయ్యముననె పెంపొంది సామాన్యోన్నతి గాంచును. అవతారపురుషులు "యదాయదా హి ధర్మస్య గ్లాని ర్భవతి, భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" అని కృష్ణభగవానుడు అర్జునునకు ఈశ్వరుని యవతరణ విధానము నెరుకపరచినట్లు అసామాన్య మహాశక్తితోనే జన్మించి లోకోద్ధారకు లగుచుందురు. అట్టి స్వల్పసంఖ్యాకులును ప్రపంచ చరిత్రనిర్మాతలు నగు మహాపురుషగణమునకు జెందినవాడు గౌతమబుద్ధుడు. ఆ మహోన్నత శ్రేణియందు లెక్కింపదగిన వారె క్రైస్తు, మహమ్మదు మున్నగు మహనీయులు. వారెల్లరు ధర్మ మడుగంటిన తరి ధర్మసంస్థాపనార్థము అవతరించినవారె. బుద్ధుడు, క్రైస్తు, మహమ్మదు—ఈ మువ్వురు జగద్గురువులు తమ శిష్యుల నెన్నుకొని వారికి ధర్మప్రబోధము గావించి వారిద్వారా కూడ ప్రపంచమున ధర్మప్రచారము జరుగుటకై వలసిన శక్తిసామర్థ్యములు గలిగించిరి.

బుద్ధుడు జన్మతః మహావిరాగి; విషయసుఖములందు ఏవగింపు గలవాడు. వ్యాధిజరామరణ దృశ్యములచే వెంటనె దుఃఖితుడై శరీర సుఖముల యనిత్యత్వము గుర్తించెను;

పిమ్మట ఒక సన్యాసిని గాంచి వైరాగ్యము ద్వారా శరీర బాధలనుండి విమోచనము కలుగునని యనుకొనెను. సంసారము, రాజ్యము, సర్వము విడిచి బాహ్యసన్యాసము పూర్తిగ నవలంబించి కఠోరముగ జీవింప మొదలిడెను. పాదచారియై రాజ్ఘర్ సమీపమందు సన్యాసులు వసించు పర్వతశిఖరము జేరి వారివల్ల ప్రబోధితు డగుటకు కృషి సలిపెను. దేహమును కృశింప జేయుటలో అచటి విరాగుల మించెను. ఎంత శ్రమపడినను జ్ఞానోదయము కాలేదు. "విష యావినివర్తన్తే నిరాహారస్య దేహినః రసవర్జం"—ఆహారాదుల మానుకొన్న మానవునినుండి విషయములు తొలగును కాని విషయాసక్తి పోదు – అని గీత తెలిపిన రహస్యము స్వీయ ముగ గ్రహించెను. వెంటనె బాహ్యసన్యాసము వదలి ఊరు విల గ్రామాధికారి పుత్రికలు నంద, నందబాల యనెడు ఇద్దరు సుందరవదనులు ఒసంగిన పాయసము త్రాగెను. కఠినసాధన లచే శుష్కించిపోవుచున్న కుమారుని కుపచారము చేయుటకై తండ్రియైనరాజు శుద్ధోదనుడు పంపిన సేవకులలో 5గురు మాత్రము బుద్ధునిచే స్వీకరింపబడిరి. బుద్ధునియందు ఆ మార్పు కలుగువరకు ఆతనివద్ద నుండి ఆతనివలన జ్ఞానము పొందుటకై వేచియుండిరి. ఆతడు తిరిగి యాహారము గైకొన్న తోడనె ఆతనిని సాధారణ మనుష్యునిగ తలంచి విడిచివేసి కాశీపుణ్యక్షేత్రమునకు యథార్థభక్తుని వెదకి సేవించుటకై వెళ్ళిరి. బుద్ధుడు తీవ్ర జిజ్ఞాస–తత్పరుడై ఊరువిల గ్రామ

సమీపమున నున్న బుద్ధగయకేగి నిరంజననది యని ప్రసిద్ధి గాంచిన ఫల్గునితీరమున బోధివృక్షముక్రింద తపోనిష్ఠుడై కొంతకాల ముండి పూర్ణప్రేమప్రబోధ బడసి ప్రేమసందేశము ప్రచారము చేయ గడంగెను. మొదట కాశీకి జని తనను విడిచిపోయిన 5గురు సేవకులను కలిసి వారికి ప్రేమతత్త్వము తెలిపి ప్రథమశిష్యులనుగ జేసికొనెను. అక్కడ యచట పలువురు అనుచరుల చేకూర్చుకొనెను. వారిలో కొందరిని ఇద్దరిద్దరు చొప్పున తన సందేశ ప్రచారమునకై యితర ప్రాంతములకు పంపెను. తాను ఊరువిలకు మరలివచ్చి తనకు పరిచితులైన నంద నందబాల యువతులను ప్రబోధితుల గావించెను. అచ టనే కఠోరబాహ్యసాధనయందు నిమగ్నుడై అనేక శిష్యులను కలిగి మహాభక్తు డని ప్రఖ్యాతి జెందిన కశ్యపుని వద్ద కరిగి అతనిని ఆతని శిష్యగణమును తన మార్గమునకు త్రిప్పుకొనెను. పిదప రాజ్ఘురుకు పోయి బింబిసారు డను రాజును అనుచరుని జేసికొని ఆతనిసాయమున రాజ్ఘురువద్ద ప్రథమవిహారము స్థాపించెను. తరువాత కోశల మున్నగు రాజ్యముల యధి పతులను నూతన పథమునకు మరల్చెను. మరియు తండ్రి శుద్ధోదనుని, భార్య యశోధరను, కుమారుడు రాహులుని, శిష్యవర్గమున జేర్చుకొన గలిగెను. శుద్ధోదనుడె కపిలవస్తు నగరములో గొప్ప బౌద్ధవిహారము నెలకొల్పెను. బంధువులు, ఇతరులు అనేకులు బౌద్ధధర్మము స్వీకరించిరి. తన యనుయా యులలో బుద్ధికుశలు డగు నందునకు అగ్రస్థాన మొసంగెను.

నందుడు ధర్మవ్యాపనకు చాల తోడ్పడెను. బౌద్ధధర్మము ఇతర దేశములందు విస్తరించి నేటికిని అనుసరింపబడుచున్నది; హిందూదేశమందు వైదిక సంప్రదాయమున మిళితము చేయ బడెను; బుద్ధుడు అవతారపురుషుడుగ గైకొనబడెను. బుద్ధుని యందు ఉత్తమగురువుయొక్క సహజ మహాచ్ఛక్తి ప్రజ్వరిల్లె నని ఎవ రంగీకరింప కుందురు?

బాల్యమందె ధర్మనిరతిచే ఒక రోజున దేవాలయమున ధర్మగోష్ఠియందు నిమగ్నుడై తల్లిదండ్రులతో స్వగృహమునకు తిరిగిపోవలయునను స్పృహయె లేనివాడు, వారు వెదకుచు తుదకు దేవాలయమునకు వచ్చి పెద్దలతో కలిసి తత్త్వ విచారణ సలుపుచున్న తనను కనుగొని తనకొరకు వెదకి వేసారితి మని చెప్పిన తల్లిదండ్రులకు "మీరు నాకోస మేల వెదకిరి? నేను నా తండ్రిగృహమందే యుందునని మీకు తెలి యదా? "యని బదులు పలికినవాడు, తాను జగదేకపితయొక్క తనయుడ నను సహజసంపూర్ణానుభూతి గలవాడు అయిన క్రైస్తు తన స్వల్పజీవితములో ఎంతటి మహత్తర వశీకరణశక్తితో అతి సామాన్యమానవులను తన శిష్యులుగ జేకొని గొప్ప ధర్మబోధకులుగ జేసి వారిద్వారాను వారి శిష్య ప్రశిష్యుల ద్వారాను క్రైస్తవ సంప్రదాయము లోకమున విస్తరించి సుస్థాపిత మగునట్లు గావించెనో కన్నులార గాంచుచున్నాము. క్రైస్తు అవతారపురుషుడు కాడా?

సర్వసృష్టిజాలము ఏకైకసృష్టికర్తను ఎరుకపరచు విభూ

తులు మాత్రమె. ఎంతటిశక్తిగల గురువు లయినను జగదేక గురుసాన్నిధ్యమున జేర్చు మార్గదర్శకులు మాత్రమె. ఏ ప్రకృతివస్తువును గాని ఏ ధర్మప్రవక్తను గాని భగవంతుడే యని భ్రమించు అల్పబుద్ధులగు జనాళియం దనేకులను తన యద్భుతదైవభక్తిచే పురికొల్పి ఏకేశ్వరు నర్చించు విజ్ఞాన వంతులుగ జేయగలిగి గొప్పమహామ్మదీయ సంప్రదాయమునకు మూలపురుషుడయిన మహమ్మదు అవతార పురుషు డనుటకు సందియ మేమి?

క్రైస్తును, మహమ్మదును పోలి అవతారపురుషులుగ పరిగణింప దగినవారు మరికొందరును గలరు. ఆ ధర్మోద్ధారకు లెల్లరిని గౌతమబుద్ధునివలెనె వైదికసంప్రదాయము స్వీకరించి వారి సంప్రదాయములను సమన్వయించి తనయందు సమ్మిళిత పరచుకొని విస్తృతినొందుచు మహా సజీవధర్మ వాహినియై నిరంతరాయముగ భారతావనియందు వెలయగల దని యూహిగ జెప్పవచ్చును. ఈ నవయుగమున నుద్భవిల్లిన భారతీయ సమ న్వయకర్తల జీవితఫలితములు అంతకంతకు విపులాకృతి నొందించుచు వైదిక సంప్రదాయమును దోహదము చేయు చున్నవి. ఉత్తమ గురుపరంపరావతరణమందు పరమేశ్వర కృపావిశేషము దర్శించుచు భారతీయులు తమ భవితవ్య మందు పూర్ణ విశ్వాసము గలిగి కృషి సలుపుదురు గాక! భారతవర్షము సర్వధర్మసమన్వయకేంద్రము కాగలదు.

---

# వైదికసంప్రదాయము

## 12. భవితవ్యము

వైదిక సంప్రదాయము వేదకాలమునుండి నేటివరకు మహాజీవనదివలె ప్రవహించుచున్నది. కేవల వర్షాధారము వల్ల ఏర్పడు నదులు వేసవికాలములో ఎండిపోవును. నిత్యజలాశ్రయములైన యున్నత హిమపూరిత పర్వతశిఖరములు గాని పాతాళ గంగా వాహినులు గాని, ఆధారముగా గలిగియున్న జాహ్నవివంటి మహానదులును సింహాచల ధారవంటి నిరంతర జలప్రవాహములును సజీవములని పరిగణింపబడును. "చిత్తమున జేసి వేదంబు లజునకు విదితము గ్గావించె నెవడు" అట్టి "యాద్యు పరుని సత్యు" ని అనుదినము కోరి చింతించు ఋషిసత్తముల మానస గంభీర కుహరమె వైదిక సంప్రదాయమునకు జన్మస్థానము. పరమాత్ముడే ఆ యోగీశ్వరులకు ఇష్టదైవము, ధ్యానదేవత. ధర్మగ్లాని యేర్పడు ప్రతియుగమున నవతరించు అట్టి మహాపురుషుల కృషిమూలముననె భారత భూమియందు వైదిక సంప్రదాయము చిరనూతనత్వము జెందుచు తెంపు లేకుండ అతి ప్రాచీనకాలమునుండి యిప్పటి వరకు పరిపోషిత మగుచు ఏకధారగా ప్రవహించుచున్నది.

ఆ దివ్యపురుషులలో ఒక్కొక్కరు "వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ; తమేవ విదిత్వాతిమృత్యుమేతి ; నాన్యః పన్థా విద్యతేఽయనాయ"

అని యుద్ఘాటించి యుపదేశించిన బీజమంత్రములను స్వీకరించి జపించి తమ జీవితములందు ఫలింపజేసికొన్న ఆచార్యవరేణ్యులు గురుకులముల నెలకొల్పి బాలబాలికా శిష్యగణముల జేర్చి వారి హృదయక్షేత్రములందు ఆ ధర్మబీజముల నాటి పెంచి వారిని కల్పతరువుల బోలిన మహోదారవ్యక్తులుగా పరిణమిల్ల జేసిరి.

అట్లు సుశిక్షితులైన నరనారీమణులతో కుటుంబములు నిర్మితములై సత్సంతానమునకు నిలయములై బిడ్డలను ధర్మనిరతు లగునట్లు పెంచి యుక్తవయస్సురాగానె క్రమశిక్షణకై గురుసన్నిధికి పంపునట్టి గొప్ప సాధనాశ్రమములుగా సంఘమున వర్థిల్లుచున్నవి. వాటి మూలమున ధర్మజీవనము పెంపొందుచున్నది.

ఈ మాటలనుబట్టి వైదికసంప్రదాయ మొక్కటే భారతవర్షమున విస్తరించి యుండెనని గాని, వైదిక సంప్రదాయమునకు జెందిన వ్యక్తులందరును కుటుంబము లన్నియుధర్మజీవనమున నున్నతస్థానమందు స్థిరముగా నిలుచుట సాధ్యపడెనని గాని, ధర్మజీవనము ఎదుగు బొదుగులులేక ఏకైకస్వరూపము, ఏకైకనామము గలిగి ఒక్కమోస్తరుగా (Uniform) ప్రతిష్ఠితమై యుండెనని గాని అర్థముచేసికొన గూడదు. వేదకాలమందును తరువాతి కాలములందును వైదికసంప్రదాయము చెంతను ఇతర సంప్రదాయములు గలవు; కాని వైదిక సంప్రదాయము ప్రాధాన్యత వహించి వాటి విశిష్టలక్షణము

లను గుర్తించి సమన్వయించి తా సంతకంతకు విస్తృతి నంది వాటి ప్రత్యేక వ్యక్తిత్వములతోనె తనతో ఆధ్యాత్మిక ఐక్యతను (Spiritual unity) సహజీవనము (Coexistance), సహకారము (Cooperation) గలిగి అవన్నియు వృద్ధిజెందుట కవకాశ మిచ్చుచున్నది.

మన దేశమున బ్రిటిషు పరిపాలనకు పూర్వముండిన విదేశీయ స్వదేశీయ ప్రభుత్వములందు లేకుండిన సర్వరాష్ట్రీయ ఐక్యతను బ్రిటిషుపాలకులు నెలకొల్ప గలిగిరి. కాని యీ యైక్యత వైదిక సంప్రదాయము సమకూర్చునట్టి ధార్మిక ఐక్యతకు భిన్నమైనది. ఒకరియెడ నొకరు ఏమాత్రము ప్రేమ జూపుటో లేనట్టియు, మరియు సాధుజనులకు ధన ప్రాణ నష్టములు కలిగించునట్టియు స్వభావములు గలనేరస్థులు ఒక చెరసాలలో నుంచబడి అచ్చటి యధికార నిర్బంధమునకు లోబడి ఒక విధమైన క్రమవర్తనయు సహజీవనమును గలిగి చక్కగా మెలగుదురు. అచ్చట చండశాసనము ఏ కారణముచేతనైన సడలిన సమయములందు బుద్ధిమంతులుగా కనబడు అక్కడి నివాసులెల్లరు నిజస్వభావములు కనపరచుచు పరస్పర కలహములచే అక్కడనె అరాచకము ప్రబలజేతురు. బ్రిటిషువారి ద్వారా భారతీయులకు లభించిన యైక్యత అట్టిదే. అది కేవల రాజకీయ ఐక్యత.

బ్రిటిషువారికి కూడ తాము భారత దేశమున స్థాపించిన యైక్యత అట్టిదే యని తెలియును. అందువల్లనే వారు మన

దేశము విడిచిపోవలసిన పరిస్థితి యేర్పడినప్పుడు, మహమ్మదీయులు, సంస్థానాధీశులు సంపూర్ణస్వతంత్రులుగ వ్యవహరించుటయు, మహమ్మదీయులు ప్రత్యేకపాకిస్థాను రాజ్యమేర్పరచుకొనుటకును, సంస్థానాధిపతులు తమ చిత్తమువచ్చినట్లు పాకిస్థానుతో గాని తక్కిన సంయుక్తభారతముతో గాని చేరుటకో, లేక స్వతంత్రరాజ్యములుగ నుండుటకో అవకాశము కలిగియుండుటయు అత్యావశ్యకమని నొక్కిచెప్పిరి. ఆ యభిప్రాయము ననుసరించి భారతదేశమునకు అద్భుతస్వాతంత్ర్యము సిద్ధించెను. బ్రిటిషుపరిపాలన వైతొలగిన యంతనె భారతీయుల హృదయములందు అణచియుంచబడిన అనైకమత్యము యొక్క భయంకర ప్రవృత్తి విజృంభించి హిందూమహమ్మదీయ కలహములకు దారితీసి ఘోరహత్యలకు, దుర్భర పరిస్థితులకు నేటివరకు కూడ కారణమై యుండుట లోకవిదితము. ఐకమత్యము లేనివారు బాహ్యనిర్బంధమువల్ల నైక్యత కలిగియున్నట్లు వర్తింపవచ్చును గాని, అది తొలగిపోగానె తమ ద్వేషముల వ్యక్తపరచుకొందురే గాని సఖ్యముగ మెలగుదురనుకొనుట వట్టి యపోహ.

పాశ్చాత్యసంస్కృతి భేదమును జూచునంతగా అభేదమును సృష్టిలో జూడ జాలదు. అకారణముననె సూర్యుడస్తమింపని బ్రిటిషు సామ్రాజ్యము విభక్తమై నేటి ప్రపంచ అగ్రజాతులలో మూడవదిగా నెంచబడు దీనస్థితికి వచ్చినది. వలస రాజ్యములపై తనకుండిన యధికారము పూర్తిగా పోవుటో, నామమాత్రముగా నిలచుటో తటస్థించుచున్నది. తనయందు విలీనమై యుండెనని తలంపబడిన ఐర్లండు సయి

తము తననుండి చీలిపోయినది. పూర్వ పాశ్చాత్యసామ్రాజ్యములుకూడ నిటులనే యౌన్నత్యము గోల్పోయినవి. పాశ్చాత్య సంస్కృతి యథార్థమైన శాంతిభద్రతలను ప్రపంచమున ప్రతిష్ఠింప జాలదు. భేదమందు అభేదమును గాంచు సమరస దృష్టిగల వైదికసంస్కృతి ద్వారానె ఎప్పటికైన సర్వజాతుల మధ్య శాశ్వత ఐకమత్యము ఏర్పడగలదు. బ్రిటిషువారు విడదీసి వెళ్ళిన 600 సంస్థానములు సులభముగ సంయుక్త భారతమున నైక్యమగుటకు ముఖ్యహేతువు భారతీయుల హృదయాంతరాళములందు పూడిపోయియున్న నీటియూటవలెకానరాకుండిన వైదిక సంప్రదాయము సర్దార్ వల్లభాయిపటేలు ప్రయత్నమువల్ల నించుక బహిర్గతమగుటయె. హృదయములో జొచ్చిన సంకుచితత్వము, మౌఢ్యము, వ్యామోహము, భయము తొలగింపగల ధర్మాత్ముడే హృదయమున దాగియున్న ధర్మజీవనమును బయటికి నుబికి ప్రవహించునట్లు జేయును గదా! భారతావనియందు వైదిక సంప్రదాయము భారతీయనవయుగ ప్రవక్తలచే, ధర్మవర్తనులచే బయల్వెడలునట్లు ఇటీవల కొంతకాలమునుండి గట్టికృషి చేయబడుచున్నది. అది మరల ప్రవహింప దొడగినది. ప్రస్తుతము దానిని ప్రధాని జవహర్‌లాల్ "పంచశీల" పేర భారతీయు లనుసరించి లోకమునకు ప్రదర్శించుటకై పాటుపడుచున్నాడు. పూర్వము కూడ దానికి భిన్నభిన్ననామములు గలవు.

భారతీయ విద్యావంతులు పాశ్చాత్యసంస్కృతి ప్రభావమునకు ఎంతగా లోనైనను, వారి నవి మోచనాపరులుగను,

సత్యాన్వేషకులుగను మార్చినది. మాక్సుముల్లరు మొదలగు పాశ్చాత్య తత్త్వవేత్తలే భారతీయ సంస్కృతి విశేషము గుర్తింపగలిగినప్పుడు, తరతరములనుండి భారత సంస్కృతి మహిమను మహాత్ముల జీవితములలో గాంచుచు, గ్రంథ పఠనముద్వారా గ్రహించుచు నెంతకాలము మన యాంగ్ల విద్యార్థికులు దానిని విస్మరించి జీవింప గలరు? మన ఆంగ్ల విద్యార్థికులు వైదికసంప్రదాయము గమనించి తదనుగుణముగ సంఘమును రాజ్యాంగమును సంస్కరింప బూనుకొన్నారు. ఈ పరివర్తన భారత దేశమునకే గాక యావత్ప్రపంచమునకు శ్రేయోదాయకము.

ఆంగ్లవిద్యతోపాటు వారిలో కొందరు ఇప్పుడు సంస్కృతమును కూడ బాగుగ నేర్చుకొనుచున్నారు. వేదమందలి, వేదమూలతత్త్వము తర్కించి వ్యక్తీకరించు వేదాంతము (ఉపనిషత్తుల)లోని, దానినె క్లుప్తముగ సూత్రములద్వారా వెల్లడించు బ్రహ్మసూత్రములందలి, దానినె గురుశిష్య సంభాషణ రూపమున సుబోధకము జేయు భగవద్గీతయందలి, తదితరములైన అట్టి పౌరాణిక ఐతిహాసిక గ్రంథములందలి సుజ్ఞానముచే ప్రబోధితులై మన పాశ్చాత్య విద్యావిమోహితు లెల్లరు వైదికసంప్రదాయమును పూర్తిగ చేపట్టు సుదినములు త్వరలో రానున్నవి. "ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్; తేన త్యక్తేన భుఞ్జీథాః, మాగృధః కస్యస్విద్ధనమ్" అను ఈశోపనిషత్ప్రథమవాక్య మొక్కటి

మాత్రము, సకల హిందూ ధర్మ గ్రంథములు నాశమై పోయినప్పటికిని, మిగిలియున్నచో చాలునని గాంధిమహాత్ముడు చెప్పెను. ఆ మహావాక్యము జీవితసూత్రము జేసికొని మహర్షి దేవేంద్రనాథటాగూరు ఉత్తమధర్మవర్తనుడు కాగలిగినాడు. ఆ శ్రేష్ఠప్రవచనమునకే గొప్ప వ్యాఖ్యజేసి విశ్వకవి రవీంద్రనాథటాగూరు త్యాగధర్మము నుద్బోధించినాడు. అట్టి అనేక బీజమంత్రములతో వైదిక గ్రంథములు నిండియున్నవి. వాటి పఠన, వాటి బోధన విరివిగ జరుగునుగాక!

బోల్పూరు శాంతినికేతనము, కాంగ్రి గురుకులము, అడయార్ దివ్యజ్ఞాన క్షేత్రము, బేలూర్ రామకృష్ణమఠము మున్నగు ధర్మబోధనాసంస్థలు నేడు మనదేశమున వెలసినవి. రాధాకృష్ణపండితుడు, అట్టి సుప్రసిద్ధ తత్త్వజ్ఞులు ఇప్పుడు లోకమున వైదికవిజ్ఞానము వెదజల్లుచున్నారు. జిడ్డు కృష్ణమూర్తి, అట్టి గొప్పధర్మ ప్రచారకులు పాశ్చాత్యదేశములందె యీనాడు నివసించుచు ఆధ్యాత్మిక చింతనము పెంపొందించుచున్నారు. ఆ వివిధకృషులు చేయుచున్న మహనీయుల ద్వారా భారతవర్షమునకు యావత్ప్రపంచమునకు మహోపకారము కలుగనున్నదని జెప్పవచ్చును. భవితవ్యము శుభదాయకమె.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

సమాప్తము

## శ్రీ దే. పె. బాపయ్య స్మారక ప్రచురణనిధి

| | |
|---|---|
| గత నిలవ | రు. 32-12 |
| " శ్రీదేశిరాజు పెదబాపయ్య – జీవనస్మృతి : రచనమంజరి " ఈ గ్రంథము అమ్మకమువల్ల జమ | ,, 93-00 |
| శ్రీ దేశిరాజు సార్వభౌమరావుగారు అడ్వకేట్, బాపట్ల నిధికి ఇచ్చిన విరాళము | ,, 50-00 |
| మొత్తము | రు 175-12 |

ఈ మొత్తమునుండి 'వైదికసంప్రదాయము' పుస్తకము ప్రచురించుటకై సొమ్ము వెచ్చింపబడెను. ఆ ఖర్చు పోను నిలవ తేల్చుకొని 9-3-61 తేదీన వెలువడు 'శ్రీ గాంధి ప్రబోధ' గ్రంథమందు ప్రకటించెదను. శ్రీ దే. పె. బాపయ్య స్మారక ప్రచురణ నిధికి ఎంత స్వల్ప విరాళములైనను కృతజ్ఞతతో స్వీకరింతును.

" శ్రీ దేశిరాజు పెదబాపయ్య – జీవనస్మృతి : రచనమంజరి " ఈ గ్రంథవిక్రయమునకై పుస్తకభాండాగారముల నిర్వాహకు లెల్లరును ప్రాక్ప్రతీచీగ్రంథమాల యభిమాను లందరును తగిన ప్రయత్నములు చేయ ప్రార్థితులు. ఆ విక్రయ ధనము నిధికి జమకట్టబడు నని యిది వరకు తెలుపబడిన విషయమే. గ్రంథప్రచురణయొక్క సాధక బాధకము లెరిగిన మిత్రులు నా కృషికి తోడ్పడకుందురా ? వారి సాయము సదా నిరీక్షింతును.

కొమరాజు హనుమంతరావు

సంపాదకుడు

## ప్రాక్ ప్రతీచీ గ్రంథమాలలో ఇదివరకు వెలువడిన

## కుసుమములు

1. జీవనస్మృతి. ( ప్రతులు అయిపోయినవి )
2. పాశ్చాత్య భావప్రపంచము.
3. హిందూ జీవన పథము. (డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్‌గారి గ్రంథమున కనువాదము)
4. నవ్యభారతోదయము.
5. శ్రీభక్త సింగరిదాసు. (జీవితము)
6. మనుష్యత్వ చరిత్రము. (శ్రీభక్తసింగరిదాసు కీర్తనలు)
7. సావిత్రీదేవీ లీల. (జీవితము)
8. శ్రీ దేశిరాజ పెదబాపయ్య-జీవనస్మృతి: రచన మంజిరి.
   406 క్రౌను ⅛ పుటలు, చక్కని అట్టబైండింగు.
   దీని వెలమాత్రము 5 రూ॥లు.
9. వైదిక సంప్రదాయము

ఇందలి ప్రతి పుస్తకము వెల ఒక రూపాయి. పోస్టుఖర్చు ప్రత్యేకము. వలయువారు క్రింది విలాసమునకు వ్రాయవలెను:

కామరాజు హనుమంతరావు

'ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల' సంపాదకుడు

దానవాయిపేట, రాజమండ్రి

## ప్రాక్ ప్రతీచీ గ్రంథమాలలో ఇదివరకు వెలువడిన

## కు సు మ ము లు

1. జీవనస్మృతి. (ప్రతులు అయిపోయినవి)
2. పాశ్చాత్య భావప్రపంచము.
3. హిందూ జీవన పథము. (డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్‌గారి గ్రంథమున కనువాదము)
4. నవ్యభారతోదయము.
5. శ్రీభక్త సింగరిదాసు. (జీవితము)
6. మహమ్మత్తు చరిత్రము. (శ్రీభక్తసింగరిదాసు కీర్తనలు)
7. మాతృదేవీ లీల. (జీవితము)
8. శ్రీ దేశిరాజ పెదబాపయ్య-జీవనస్మృతి : రచన మంజిరి. 406 క్రౌను ⅛ పుటలు, చక్కని అట్టబైండింగు. దీని వెలమాత్రము 5 రూ॥లు.
9. వైదిక సంప్రదాయము

ఇందలి ప్రతి పుస్తకము వెల ఒక రూపాయి. పోస్టుఖర్చు ప్రత్యేకము. వలయువారు క్రింది విలాసమునకు వ్రాయవలెను:

కా మ రా జు హ ను మ ం త రా వు
'ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల' సంపాదకుడు
దానవాయిపేట, రాజమండ్రి